# ఆత్మ సాక్షాత్కారానికి షోడశ యోగాలు

# ఆత్మసాక్షాత్కారానికి షోడశ యోగాలు

ఆంగ్లమూలం:
**స్వామి శ్రీకాంతానంద**

తెలుగు సేత:
**ప్రొఫెసర్ పన్నాల శ్యామసుందరమూర్తి**



శ్రీరామకృష్ణ మఠం
మైలాపూరు, చెన్నై - 600 004

Published by :
The President
Sri Ramakrishna Math
Mylapore, Chennai 600 004



I-2M 1C-7-99
ISBN 81-7120-858-4

Printed in India at
Sri Ramakrishna Math Printing Press
Mylapore, Chennai 600 004

## మనవి

శ్రీరామకృష్ణుల దివ్యలీలలో విభిన్న పాత్రల పోషణార్థం ఆయన ప్రత్యక్ష శిష్యులు పదహారు మంది యీ భువిపై అవతరించారు. వారి ఆదర్శమయ జీవితాల ద్వారా శ్రీరామకృష్ణులు ఆధ్యాత్మిక లక్ష్యమైన ఆత్మసాక్షాత్కారానికి దారితీసే అనుభవ, వాత్సల్య, జప, అధ్యాత్మ, శరణాగతాది షోడశ యోగాలను లోకానికి ప్రదర్శించి చూపించారు. ఈ పుస్తకంలో రచయిత స్వామి శ్రీకాంతానందగారు ప్రత్యక్ష శిష్యుల జీవితాలలో ఆయా యోగాలు ఎలా ప్రతిబింబించినవో చక్కగా అద్దంపట్టి చూపారు.

సులభశైలిలో సాగిన యీ తెలుగు అనువాదం ఆంధ్రపాఠకులకు, అందునా ఆస్తికమహాజనులకు, జిజ్ఞాసువులకు వారి ఆధ్యాత్మిక పురోగమనంలో ఇతోధికంగా దోహదం చేస్తే మా యీ ప్రయత్నం సఫలీకృతమైనట్లు భావిస్తాం.

సరళంగా తెలుగు అనువాదం చేసి యిచ్చిన ప్రొఫెసర్ పన్నాల శ్యామసుందరమూర్తిగారికి కృతజ్ఞతాభివందనాలు.

గురుపూర్ణిమ
*28 జూలై, 1999*

ప్రకాశకులు

విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. అనుభవ యోగం | ..... | 12 |
| 2. వాత్సల్య యోగం | ..... | 15 |
| 3. భక్త - భగవాన్ యోగం | ..... | 19 |
| 4. జీవ - శివ యోగం | ..... | 22 |
| 5. శరణాగతి యోగం | ..... | 28 |
| 6. చిన్మయ విగ్రహ యోగం | ..... | 33 |
| 7. నేతి - నేతి యోగం | ..... | 36 |
| 8. శారదా సేవాయోగం | ..... | 42 |
| 9. విషాద యోగం | ..... | 47 |
| 10. జప యోగం | ..... | 51 |
| 11. అధ్యాత్మ యోగం | ..... | 56 |
| 12. కర్మకౌశల యోగం | ..... | 60 |
| 13. సనాతన యోగం | ..... | 64 |
| 14. సరళ యోగం | ..... | 69 |
| 15. ఆత్మసంయమ యోగం | ..... | 73 |
| 16. కృపాయోగం | ..... | 77 |


# ఆత్మసాక్షాత్కారానికి షోడశ యోగాలు

సాధకుల ఆధ్యాత్మిక ప్రయోజనాలను పరిరక్షించటం కోసం ప్రతి యుగంలో భగవంతుడు మానవరూపంలో అవతరిస్తాడు. ఆ యుగ అవసరాన్ని అనుసరించి భగవంతుని వ్యక్తీకరణ గూడా మారుతుంటుంది. ప్రతి యుగంలోనూ ధర్మం క్రమక్రమంగా క్షీణిస్తుంటుంది కాని కలియుగంలో ధర్మగ్లాని లేక పతనం అత్యంత క్షీణదశకు చేరుకొని, భూమి నుండి ధర్మమే ఇక పూర్తిగా నశిస్తుందనిపిస్తుంది. ప్రజలలో ధర్మాధర్మ విచక్షణ కొరవడుతుంది. శాశ్వత, సనాతన విలువలను, దైవీగుణాలనూ లక్ష్య పెట్టక, అప్రధానమైన, నిస్సారమైన విషయాల వెంట పరుగులిడి, స్వార్థ పూరిత కోరికల ప్రభావంతో పిశాచాలవలె ప్రవర్తిస్తారు. మతం కేవలం కొన్ని ఆచారాలకు, వైదిక కర్మలకు, పూజలకు, ఉపచారాలకు, మూఢ నమ్మకాలకూ పరిమితం చేయబడుతుంది. ప్రజలలో సరైన శాస్త్రీయ దృక్పథం, అవగాహనాలేక, కాలానుగుణంగా గౌరవింపబడి, అనేక సాధకులచే ప్రయత్నింపబడి, పరిశీలింపబడి రుజువు చేయబడిన శాశ్వత సత్యాలను నిర్లక్ష్యం చేయటమే కాక తాము ఏవిధమైన మతాన్ని అంగీకరించ నక్కరలేదనీ, అనుసరించ నక్కరలేదనీ భావిస్తారు. దీనికితోడు క్షీణిస్తూ పతనం చెందుతూన్న మతం వారి శాస్త్రీయ దృక్పథానికి సరైన సమాధానాన్ని గూడా యివ్వలేదు, సంతృప్తిపరచలేదు. దానితో వారు మతాన్ని వ్యర్థమైనదిగాను, పనికిరానిదిగనూ, ఆచరణయోగ్యం కానిదిగానూ భావించి తిరస్కార భావంతో విడిచిపెడతారు.

గత శతాబ్దపు ఆరంభంలో, పరిస్థితి చాలా దయనీయంగా వుండి ప్రజలు పూర్తి మతిమరుపు, గందరగోళాలతో నిండివున్నారు. సనాతన మతం గురించి యథార్థంగా, ఆధికారికంగా, ప్రామాణికంగా, స్పష్టంగా

తెలియజెప్పు గలిగినవారు ఒక్కరు గూడా లేరు. ప్రజలు తమ మతంలో విశ్వాసం కోల్పోవటమే కాక కొత్త మతాన్ని స్వీకరించటానికి కూడ సిద్ధంగా లేరు. అటువంటి సందర్భంలో ఈ పరిస్థితిని పూర్తిగా మార్చ గలిగి ప్రజలకు నూతన జ్యోతిని, జీవనాన్ని ప్రసాదించ గలిగిన మహోన్నత ఆధ్యాత్మిక శక్తి భూమిపై అవతరించ వలసిన అవసరం ఏర్పడింది. సజ్జనులు, భక్తులు అటువంటి రక్షకుడు, మహానుభావుని అవతరణకై స్వర్గంవైపు దృష్టిసారించి ప్రార్థించారు. ఈ ఆక్రందన దయామయుడైన భగవంతుని చెవిన పడింది. ధర్మపునరుద్ధరణకు ఆయన మరల భువిపై శ్రీరామకృష్ణ రూపంలో తనశక్తి (ఆద్యాశక్తి) - శ్రీ శారదాదేవితోనూ, షోడశ సన్యాస శిష్యులతోనూ అసంఖ్యాకమైన మహోన్నత ఆధ్యాత్మిక వ్యక్తులతోనూ కలిసి అవతరించారు. శ్రీరామకృష్ణుల ప్రధాన, ప్రఖ్యాత శిష్యుడైన వివేకానందస్వామి శ్రీరామకృష్ణులను ఈ విధంగా వర్ణించారు:

''మత చరిత్రలో ఒక నూతన శకానికి శ్రీకారం చుట్టిన అందరి ఆధ్యాత్మిక గురువరేణ్యుల సమీకృత, సమన్వయ వ్యక్తీకరణమే భగవాన్ శ్రీరామకృష్ణులు. ఓ మానవుడా! ఈ మాటల యందు విశ్వాసం కలిగి వుండి, నీ హృదయంలో పదిలపరచుకో!''

ధర్మసంస్థాపనలో అవతారపురుషుని విజయం అతని శిష్యుల గొప్పతనంమీద ఎక్కువగా ఆధారపడి ఉంటుంది. ఈసారి భూమిపై తన లక్ష్యసాధనకు, ఆయన పురాతన మహర్షుల, సాధువుల, సజ్జనుల కక్ష్య నుండి అనేక మహోన్నత ఆధ్యాత్మిక వ్యక్తులను ఎంచుకొని తనతోపాటు తీసుకువచ్చారు. నరేంద్రనాథ్ సప్తర్షులలో ఒకరనీ, రాఖాల్ పూర్వజన్మలో శ్రీకృష్ణ సఖుడని, శశి, శరత్ - ఏసుక్రీస్తు శిష్యులనీ శ్రీరామకృష్ణులే స్వయంగా తెలిపారు.

ఈ సత్యాన్నే వివేకానందస్వామి తన శిష్యుడు శరత్‌చంద్ర చక్రవర్తితో మాట్లాడుతూ మరొకసారి నొక్కివక్కాణించారు. ఆయన ఈ విధంగా అన్నారు:



''శ్రీరామకృష్ణులొక అద్భుతమైన తోటమాలి. వైవిధ్యంగల చక్కటి పుష్పాలతో ఆయనొక పుష్పగుచ్ఛం తయారుచేసి తన సంప్రదాయాన్ని ఏర్పరచారు. దాన్లోకి రకరకాల వారు, వివిధ భావాలతో వచ్చారు - ఇంకా అనేకులు వస్తారు. ఇక్కడ వున్న వారందరూ మహోన్నత ఆధ్యాత్మిక శక్తిమంతులని గుర్తుంచుకో! అనంతమైన ధార్మిక భావాల స్వరూపియైన శ్రీరామకృష్ణుల శరీరంలో వీరందరూ భాగమని తెలుసుకో! నువ్వీ ప్రపంచ మంతా తిరగవచ్చు కానీ భగవంతుని యందు యింత ప్రగాఢ విశ్వాసం కలవారిని గానీ, ఇంతటి ఆధ్యాత్మిక శక్తిమంతులని గానీ చూడగలవనడం సందేహమే! వీరిలో ప్రతి ఒక్కరూ ఒక్కొక్క ఆధ్యాత్మిక శక్తికేంద్రం. కాలక్రమేణా ఆ శక్తి ప్రకటిత మవుతుంది.''

శ్రీరామకృష్ణుల గురించి వ్రాసిన ఒక స్తోత్రంలో వివేకానందస్వామి ఆయనను మూర్తీభవించిన అనంత ఆధ్యాత్మిక భావసముదాయంగా ''భావసాగరం'' అని వర్ణిస్తారు. భక్తి శాస్త్రాలు 19 ఉన్నత భావాలను మహాభావాలుగా తెలుపుతాయి. ఈ భావాలన్నీ శ్రీరామకృష్ణులలో పరిపూర్ణంగా ప్రకటితమవటం మనం చూడగలం. దాదాపు ఎల్లప్పుడూ ఆయన భావ పారవశ్య స్థితిలోనే ఉండేవారు. ఆయన మనస్సును సాధారణ చైతన్య స్థితికి తీసుకురావటం చాలా కష్టసాధ్యమైన పనిగా ఉండేది. ఈ దివ్య నాటకాన్ని దర్శించగల ధన్యజీవులు కొద్దిమంది మాత్రమే ఉన్నారు. వారిలో దివ్యజనని శ్రీ శారదాదేవి ఒకరు. రాత్రంగా మేలుకొనివుండి శ్రీరామకృష్ణుల మనస్సును ఉన్నత చైతన్య స్థితినుండి సాధారణ స్థితికి తీసుకురావటానికి ఆమె చాలా కష్టపడవలసివచ్చేది. రాత్రంతా గురుదేవులు భగవత్సాంగత్యంలోనే ఉంటూ, ఒక్కొక్కసారి నవ్వుతూ, మరొకసారి విలపిస్తూ, వేరొకసారి గాఢ సమాధి నిమగ్నులై ఉండేవారు. అంతటి మహోన్నత స్థితిని పొందటం మహర్షులకు, మహామునులకు, ప్రవక్తలకు, ఋషులకు కూడా సాధ్యపడదు. ఇక సాధారణ సాధకులకది సాధ్యమవుతుందా? ఆ క్షణకాల సాక్షాత్కారమే సాధకుని మనస్సును అనంతమైన

శాంతి, ఆనందాలతో ప్రమత్తుని చేస్తుంది. కాని పరమ పవిత్రమూ, సాత్త్వికమూ అయిన మనస్సుగల శ్రీరామకృష్ణులకు మాత్రం అది ఒక సహజ సిద్ధంగా, అప్రయత్నంగా లభించే అనుభూతి. ఆ అనుభూతిలోని ఏ ఒక్క చిన్న అంశం లభించినా మానవుడు అమృత స్వరూపుడయి పోతాడు. కానీ శ్రీరామకృష్ణులు అటువంటి అనుభూతులతో సంతోషించే వారు కాదు. ఆధ్యాత్మికానందం తానొక్కడే పొందటం ఆయన లక్ష్యం కాదు కాబట్టి తీవ్రమైన ఆవేదనతో ఆయన జగజ్జననిని ఈ విధంగా ప్రార్థించేవారు: ''అమ్మా! నన్ను స్పృహలేని వానిగా చేయబోకు. ఇక్కడికి వచ్చేవారందరితో నేను సంభాషించాలి.'' భవరోగగ్రస్తులైన మానవాళి సముద్ధరణకే ఆయన జన్మించారు. ఆయన శిష్యులలో ఒకరైన అభేదా నందస్వామి - ఈ అంశాన్నే ప్రార్థనా మంత్రంలో ''భక్తుల పట్ల అపారమైన కరుణతో, మీ రీ మానవరూపం ధరించారు'' అని చక్కగా వర్ణించారు.

గురుదేవుల శరీరం చాలా సున్నితంగానూ, మనస్సు శుద్ధ సాత్త్వికం గానూ ఉండేవి. అందుచేత, బాధిత మానవాళిని చేరటం ఆయనకు కష్టంగా ఉండేది. కానీ ఆర్తులైన మానవాళి కష్టాలను తీర్చకపోతే, ఆయన అవతార లక్ష్యమే నెరవేరదు. అందుచేత తన లక్ష్యసాధనలో సహకరించ టానికి, ఆయన తనతోపాటు 16 మంది సన్యాస శిష్యులను తీసుకువచ్చి, వారిలో తన ఆధ్యాత్మిక శక్తిని ప్రసరింపచేసి, తన సందేశాన్ని విశ్వవ్యాప్తం చేయటానికి వారిని తగిన పరికరాలుగా మలచారు.

అనంత భావసాగరంగా శ్రీరామకృష్ణులను భావిస్తే - భావలహరిగా, ఉత్తుంగ తరంగాలుగా ప్రతిక్షణమూ ఎగిసే భావాలతో కూడివున్న ఆ భావసాగరంలో మన మనస్సనే ఈ చిన్ని పడవ సాయంతో ప్రవేశించటం సాధ్యమవుతుందా? మనం ప్రయత్నించినా, ఆ మహాసముద్రంలో మన ఈ చిన్ని పడవలు మునిగిపోయే ప్రమాదంవుంది. మరి మార్గమేమిటి? మన ఈ సమస్య శ్రీరామకృష్ణులకు బాగా తెలుసు. అందుచేతనే ఈ విషయంలో మనకు సహాయం చేయటానికి, ఆయన తనతోపాటు 16



మంది శిష్యులను తీసుకువచ్చారు. వారు 16 పవిత్ర నదులవంటివారు. వివేకానందస్వామి జ్ఞానగంగ, బ్రహ్మానందస్వామి భక్తియమున - అలాగే మిగిలినవారు. మన పడవలను ఈ పవిత్ర నదులలో చేరిస్తే వాటిద్వారా అతిసులభంగా భావసాగరాన్ని చేరుకోవచ్చు.

విశేషపూజలప్పుడు భగవంతునికి సమర్పించే ''పంచామృతం'' అనబడే పాలు, పెరుగు, నెయ్యి, పంచదార, తేనెల సముదాయం - గురించి మనందరికీ తెలుసు. అది చాలా రుచికరంగా, పుష్టికరంగా, మధురంగా ఉంటుంది. కానీ దానిలో తేనె, పంచదార ఉంటాయి కాబట్టి మధుమేహ వ్యాధి గలవారు మాత్రం దానిని తీసుకోకూడదు. అదేవిధంగా శ్రీరామ కృష్ణులు షోడశామృత స్వరూపులు - 16 రకరకాల మధుర, రుచికర పదార్థాల సముదాయం. కానీ సరైన అవగాహన లేని, బుద్ధిహీనులైన సాధారణ జనులు మాత్రం శ్రీరామకృష్ణుల దివ్యభావాలలోని ఔన్నత్యాన్నీ, తీవ్రతను గ్రహించలేరు. అటువంటి వారికి సహాయం చేయటానికే ఆయన తనను తాను 16 మంది ప్రత్యక్ష సన్యాస శిష్యులుగా విభజించు కున్నారు. వారి దివ్యతత్త్వంలో వీరందరూ అంశాలు. ఆ విధంగా మనబోటి వారందరికీ శ్రీరామకృష్ణులు మార్గం సుగమం చేశారు. ఇప్పుడిక మన శక్తికొలదీ, మన అవగాహనను బట్టీ, మన మానసిక స్థాయి, స్వభావాన్ని బట్టీ, సంస్కారాలనుబట్టీ, ఈ షోడశామృత భాగాలలో ఒకటి లేక రెండు భాగాలను ఎంచుకొని ఆధ్యాత్మిక లక్ష్యాన్ని చేరవచ్చు.

వేదాలు జ్ఞాన సముదాయం. కానీ మానవుని జీవితంలో అంతటి విస్తారమైన సాహిత్య పఠనం సాధ్యపడదు. శాశ్వత సత్యాలను కలిగివుండి, వేదసారంగా పిలవబడే వేదాంతం లేదా ఉపనిషత్తులు మాత్రం పరిమిత సంఖ్యలోనే ఉన్నాయి. వాటిని పఠిస్తే, వేదాలలోని వివిధ అంతర్గత రహస్యాలను, బోధలను సులభంగా అర్థం చేసుకోవచ్చు. శ్రీరామకృష్ణులు మూర్తీభవించిన వేదస్వరూపం - ''వేదమూర్తి''. ఆయన అనంత జ్ఞాన స్వరూపులు, అనంత భావసముదాయం. అంతేగాక అన్ని భావాలకూ

అతీతులు. వారికి కలిగిన ప్రగాఢ అనుభూతుల తత్త్వాన్నీ, లోతునూ వేదాలు, వేదాంతం గూడ కొలవలేవనీ, గ్రహించలేవనీ ఒక కవి అంటాడు. అటువంటిది, మనమెలా ఆయనను అర్థం చేసుకోగలం? - వారి శిష్యులద్వారా అర్థం చేసుకోగలం. వారు 16 ఉపనిషత్తుల వంటివారు. వారి జీవితాలు ఘనీభవించిన జ్ఞాన స్వరూపాలు. వారి జీవితాలు, బోధనలు పఠిస్తే, ఆ అనంత జ్ఞానసాగరంలో కొద్ది అంశం అర్థమవు తుంది. శివానందస్వామి స్వయంగా ఒక యువసన్యాసికి ఈ సూచన చేశారు. ఒకరోజు కమలేశ్వరానందస్వామి శివానందస్వామితో, ''మీతో కలిసి ఉపనిషత్తులు పఠిద్దామనుకుంటున్నాను'' అన్నారు. సమాధానంగా శివానందస్వామి, ''మా జీవితచరిత్రలు పఠించగలవా? మా జీవితాలే నిశ్చయంగా నిజమైన ఉపనిషత్తులు. శాస్త్రసారమంతా ఇక్కడ చూడవచ్చు ... గురుదేవుల నుండి పొందిన దివ్యతేజస్సునే మీతో నేను పంచు కుంటున్నాను. ఒక జ్యోతి మరొక జ్యోతిని వెలిగిస్తుంది. ఆ విధంగానే మన మందరము కలుపబడివున్నాము'' అన్నారు.

సాధారణ చర్మచక్షువులతో చూడలేనటువంటి ప్రచండ మార్తాండుని వంటివారు శ్రీరామకృష్ణులు. చలువకళ్ళజోళ్ళ వంటివారు ప్రత్యక్ష సన్యాస శిష్యులు. మీ మానస చక్షువులకు ఈ కళ్ళజోళ్ళు పెట్టు కుంటే ఆధ్యాత్మిక నేత్రం ద్వారా శ్రీరామకృష్ణులను స్పష్టంగా దర్శించ వచ్చు.

శ్రీరామకృష్ణులొక చక్కని కిరీటం వంటివారు. ఆ కిరీటానికి శోభను, వన్నెనూ, అందాన్నీ ఇనుమడింపజేస్తూ వింత కాంతులను ప్రసరింపజేస్తూ చుట్టూ పొదగబడిన విభిన్న రత్నాల, వజ్రాల వంటివారు ప్రత్యక్ష సన్యాస శిష్యులు.

ఉపగ్రహాల గురించీ, సమాచార పరిజ్ఞానం గురించీ అత్యంత ఉన్నతంగా భావించే ఈ ఆధునిక శాస్త్రయుగంలో గురుదేవుల 16 మంది ప్రత్యక్ష శిష్యులనూ 16 ఉపగ్రహాలుగనూ, అసంఖ్యాకమైన జీవులను



చిన్నచిన్న కంప్యూటర్లుగనూ పోల్చవచ్చు. ఈ సమాచార శాస్త్రాన్నుపయో గించి, మీ కంప్యూటర్లను ఈ ఉపగ్రహాలకు అనుబంధ పరిస్తే, మీ మనస్సనే తెరపై శ్రీరామకృష్ణుల చిత్రపటమును స్పష్టంగా దర్శించవచ్చు.

శ్రీరామచంద్రుడు దక్షిణ భారత అగ్రాన ఉన్న సముద్రతీరాన కూర్చొని నిస్సహాయంగా సీతాదేవి కొరకై బిగ్గరగా విలపించాడు. రావణుని చెరనుండి ఆమెను విడిపించాలని అనుకున్నా, తనముందున్న అపార జలసాగరాన్ని దాటి వెళ్ళలేక ఆమెను చేరలేకపోయాడు. పరమాత్మ లక్ష్య సాధనలో సహకరించటానికి మహావీరులైన హనుమంతుడు, సుగ్రీవుడు, నలుడు, నీలుడు, జాంబవంతుడు, విభీషణుడు సముద్రంపై పెద్ద వారధిని నిర్మించారు. ఈ వారధి మీదుగా శ్రీరామచంద్రుడు తరలి వెళ్ళి, సముద్రపు అవతలి ఒడ్డును చేరి, రావణునిచే వేధింపబడుతున్న సీతామహాసాధ్విని రక్షించాడు. శ్రీరామకృష్ణుల విషయంలోగూడా ఇదే విధంగా జరిగింది. ఈ ప్రపంచంలోని దుఃఖాల, కష్టాలతో బాధింపబడు తున్న జీవులను ఉద్ధరించటానికి ఆయన అవతరించారు. కానీ తన సున్నితమైన ఆరోగ్యం మూలంగా మానవాళిని చేరలేక నిస్సహాయంగా ఉండిపోయారు. ఒకసారి ఒక భక్తునితో తన హృదయవేదనను ఆయన ఈ విధంగా వ్యక్తపరచారు: ''చైతన్య మహాప్రభువు యింటింటికీ తిరిగి భగవన్నామాన్ని ప్రచారం చేశారు కానీ నేనో - గుర్రపుబండి లేకుండా అసలు బయటికే కదలలేను.'' కానీ, ఇంతకుముందు అవతారంలో సీతాదేవి పరిరక్షణకై సహకరించిన తన ప్రియతమ శిష్యులు ఈ అవతారంలో గూడ తనకు తప్పక సహకరించటానికి వస్తారని ఆయనకు నిశ్చయంగా తెలుసు. మధురనాథుని భవనం పైకప్పునెక్కి, ఆవేదనాభరిత హృదయంతో, అశ్రుపూర్ణ నయనాలతో ఆయన వారందరినీ ఈ విధంగా పిలిచారు: ''నా ప్రియతమ శిష్యులారా! రండి! మీ కోసం ఆత్రుతతో వేచివున్నాను. త్వరగా రండి. వచ్చి లక్షలాది బాధిత జీవులు భవసాగ రాన్ని దాటి శాశ్వతత్త్వాన్నీ అమృతత్త్వాన్నీ పొందటానికి వీలుగా వారధిని

నిర్మించండి.'' ఈ ఆవేదనాభరిత పిలుపును నరేంద్రనాథ్, రాఖాల్, తారక్, గంగాధర్, కాళి, శరత్, ఇతర శిష్యులూ విన్నారు. వారందరూ హనుమంతుడు, నల, నీల, జాంబవంతుల వలె వచ్చి, ప్రపంచవ్యాప్తిగా ప్రఖ్యాతి గాంచిన ''రామకృష్ణ మఠము - రామకృష్ణ మిషను'' అనే వారధిని నిర్మించారు. ఈనాడు, లక్షలాది జీవులు ఈ వారధి మీదుగా నడచి సంసారసాగరాన్ని సులభంగా దాటుతున్నారు.

ఈ మనోభావాన్ని రామకృష్ణానందస్వామి ఒక చక్కటి గణిత సిద్ధాంతంద్వారా వెలిబుచ్చారు. ఒకరోజు భక్తులతో మాట్లాడుతూ ఆయన ఈ విధంగా అన్నారు: ''మీరందరూ గురుదేవులను అవతార పురుషుడని అంటుంటారు. అసలు మీకు అవతారమంటే ఏమిటో తెలుసా?'' ఈ విధంగా అడిగిన తర్వాత తనే దానికి వివరణయిస్తూ ఈ విధంగా చెప్పారు: ''వివేకానందస్వామి, ఆయన ప్రసంగాలూ, రచనలూ, కార్యక్రమాలూ + అనంతం - ఇవన్నీ కలిసి శ్రీరామకృష్ణులకు సమానం.''

చాలాసార్లు గురుదేవులే స్వయంగా తన శిష్యుల గొప్పతనం గురించి చెప్పారు. నరేంద్రనాథ్‌ను ఆయన సహస్రదళ పద్మంతో పోల్చేవారు.

గురుదేవుల గృహస్థ శిష్యులలో బలరాం బోసు చాలా గొప్పవాడు. గురుదేవులు బలరాం బోసుతో తరచూ నరేంద్ర, రాఖాల్, తారక్ వంటి యువశిష్యులను వారి ఇంటికి ఆహ్వానించమని చెబుతూ ఈ విధంగా అనేవారు: ''ఈ పవిత్రాత్ములు దైవస్వరూపులే! వారికి ఆతిథ్యమిస్తే భగవంతునికే ఆతిథ్య మిచ్చినట్లవుతుంది. వారు విశిష్ట దైవీగుణాలతో జన్మించారు. వారిని సేవిస్తే దైవాన్ని సేవించినట్లే!''

ఆ విధంగా శ్రీరామకృష్ణులే ఈ భువిపై తన శిష్యుల రూపంలో జన్మించిన మహోన్నత ఆధ్యాత్మిక శక్తి జనక యంత్రాల (డైనమో) గురించి స్వయంగా ప్రశంసించారు. గురుదేవుల శరీరం శుద్ధసత్త్వంతో పూర్తిగా నిండివున్నది. కాబట్టి ప్రతి ఒక్కరి స్పర్శనూ ఆయన భరించ



గలిగేవారు కాదు. పవిత్ర హృదయులైన కొద్దిమంది మాత్రమే భావ పారవశ్య స్థితిలో ఉన్న గురుదేవుల శరీరాన్ని స్పృశించగలిగేవారు.

మానసిక పరిశుద్ధత లేనివారికి గురుదేవులతో ప్రత్యక్షంగా పరిచయం కలిగి ఉండటం, వారికి సన్నిహితంగా మెలగటం సాధ్యమయ్యేదికాదు. బృందావనంలోని గంగామాయి, వారణాసిలోని త్రైలింగ స్వామి గురుదేవులను ప్రత్యక్షంగా కలిసిన మహానుభావులు. అంతేకాక గురుదేవులతో నేరుగా పరిచయం గలిగి, పవిత్రహృదయులైన కొంతమంది సన్న్యాస, గృహస్థ శిష్యులుగూడ వారి ఆశీస్సులు పొందగలిగారు. గురుదేవులు శిష్యుల కోర్కెలు తీర్చే కల్పతరువుగా వరములిచ్చిన రోజునగూడా అక్కడున్న వారందరినీ ఆశీర్వదించలేదు. కొద్దిమందికి మాత్రమే ఆశీస్సులు లభించాయి.

అందుచేత, మానసిక పవిత్రత అంతగా లేనివారు, గురుదేవుల్ని వారి శిష్యులద్వారా సమీపించడం మంచిది. వారి ద్వారా వెళితే, గురుదేవులు తమ ప్రియతమ శిష్యుల అభ్యర్థనను తిరస్కరించలేరు గనుక తప్పక మనలను ఆదరిస్తారు, స్వీకరిస్తారు. ఇది ఒక ఊహకాదు, అతిశయోక్తి కాదు. యథార్థ విషయం. హాజ్రా దీనికి ఉదాహరణ. కాశీపూరు ఉద్యాన గృహంలో 1886 జనవరి 1వ తేదీన గురుదేవులు భక్తు లందరినీ అనుగ్రహించే తరుణంలో. గురుదేవులకు సన్నిహితుడైన హాజ్రా, ఆ రోజున ఎక్కడికో వేరే పనిపై వెళ్ళాడు. ఆతడు తిరిగి వచ్చాక, కల్పతరువు సంఘటన గురించి తెలుసుకొని, చాలా నిరుత్సాహపడ్డాడు.

జనవరి 6వ తేదీన ఆతడు రోజంతా ఉపవాసం ఉండి శ్రీరామకృష్ణుల ప్రత్యేక ఆశీస్సుల కోసం ఆయన దగ్గరకెళ్ళాడు. ఆతడి ఉద్దేశం తెలుసుకొని, గురుదేవులు తన గదివద్ద వున్న పరిచారకునితో హాజ్రాని గదినుంచి బయటకు వెళ్ళమని చెప్పమన్నారు. వెంటనే హాజ్రా శ్రీరామకృష్ణుల పాదాలు పట్టుకున్నాడు కానీ గురుదేవులు ఆతణ్ణి అనుగ్రహించలేదు. అంతేగాక తన శిష్యుడు లాటూని పిలిచి హాజ్రాను తన గదినుంచి

బయటికి తీసికెళ్ళమని ఆదేశించారు. తెలివిగల హాజ్రా ఈ విషయాన్ని అంత సులభంగా వదిలిపెట్టే రకంకాదు. ప్రత్యక్షంగా గురుదేవుల అనుగ్రహం పొందటంలో విఫలమైన హాజ్రా నరేంద్రనాథ్ ద్వారా తన పనిని సాధించదలిచాడు. హాజ్రాపై దయతో, నరేంద్రనాథ్ అతనిని గురుదేవుల గదికి తీసికెళ్ళి ఆశీర్వదించవలసిందిగా గురుదేవులను ప్రార్థించాడు. కానీ గురుదేవులు యిష్టపడలేదు. నరేంద్రుడు మరీమరీ ఒత్తిడిచేయగా, దయామయులైన గురుదేవులు తన ప్రియశిష్యుని అభ్యర్థనను తిరస్కరించలేక ఈ విధంగా వాగ్దానం చేశారు: ''అతనికి సమయం యింకా ఆసన్నమవలేదు. చివరి సమయంలో అతనికి ఆశీస్సులు లభిస్తాయి.'' శ్రీరామకృష్ణుల ఈ ఆశీస్సులు యథార్థంగా నిరూపితమయినాయి. ఇంక కొద్దిసేపటికి దేహత్యాగం చేస్తాడనగా, హాజ్రాకి గురుదేవుల దర్శనం, ఆశీస్సులు లభించాయి.

శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష సన్యాస శిష్యుల జీవిత చరిత్రలు, బోధలు చదివి, అవగాహన చేసుకొని, వాటిలో ఏ లేశమైనా ఆచరణలో పెడితేనే గురుదేవుల ఆశీస్సులు పొందటానికి అర్హుల మవుతాము.

ఈ కలియుగంలో మానవుడు ఉన్నత విలువల గురించి ఆలోచించటానికి గూడా సమయం దొరకనంతగా పతనం చెందాడు. అతడు లౌకిక భోగభాగ్యాలతో, సుఖాలతో మత్తిల్లి, ఆ క్షీణదశకు తనను తాను దిగజార్చుకున్నాడు. సైన్స్ (శాస్త్ర పరిజ్ఞానం) పేరుతో, తన ఇంద్రియాలకు గోచరంకాని ప్రతి విషయాన్నీ తిరస్కరిస్తున్నాడు. ఇతరులు చెప్పినదాన్ని అసలు విశ్వసించటంలేదు. ప్రతిదీ తనంతట తానుగా పరీక్షించి తెలుసుకోవాలనుకుంటున్నాడు. ప్రదర్శనల ద్వారా, ప్రయోగాల ద్వారా సంతృప్తి చెందితేగాని దేనినీ అంగీకరించలేని స్థితిలో ఉన్నాడు.

శ్రీరామకృష్ణ అవతారంలో, భగవంతుడు ఈ సవాలును స్వీకరించాడు. బాల్యం నుండీ రామకృష్ణులు అనుష్ఠాన యోగ్యంకాని మత సిద్ధాంతాలను నిరసించారు. ఆయన ఏ మత గ్రంథాన్నీ పఠించలేదు. కాని



తన జీవిత ప్రయోగశాలలో విభిన్న పరిశోధనల (సాధనల) ద్వారా మత సారాన్నీ, అన్ని మతాల వెనుకగల యథార్థ తత్త్వాన్నీ గ్రహించారు. మానవ జీవితపు చరమ లక్ష్యమైన భగవత్సాక్షాత్కారాన్ని వివిధ మతాల ద్వారా పొందిన తర్వాత ''భగవంతుడొక్కడే నిత్యసత్యమైన వాడనీ, ఆయన సాక్షాత్కారమే మానవ జీవిత లక్ష్య''మని అతి స్పష్టంగా, నిర్ద్వంద్వంగా ప్రకటించారు. భగవత్సాక్షాత్కారం ద్వారా మాత్రమే మానవుడు తన జీవితంలో ఎదుర్కొనే అతిసహజ దుఃఖాలైన జనన, మరణ, వ్యాధి, వార్ధక్యాలను అధిగమించి, శాశ్వత శాంతినీ, ఆనందాన్నీ, అమృతత్త్వాన్నీ పొందగలడు. ఆవేదనాపూరిత హృదయంతో ఆర్తిగా భగవంతుని స్మరిస్తే, ఈ జీవితంలోనే, ఇప్పుడే, ఇక్కడే భగవంతుని పొందవచ్చునని, ఆయన తన జీవితంలో నిరూపించారు. ఈ సత్యాన్ని తన జీవితంలో నిరూపించటమే గాక, భగవత్సాక్షాత్కారం ఎలా పొందాలో ప్రజలకు తెలియజెప్పటానికి ఆయన తనతోపాటు పదహారుమంది శిష్యులను తీసుకు వచ్చారు. ఈ యుగంలో మానవుడెంతగా లౌకికత, ప్రాపంచికతలలో మునిగివున్నాడంటే, దాని నుంచి అతనిని బయటికి లాగటానికి చాలా శక్తిమంతమైన ఔషధాలు వాడవలసి ఉంటుంది. ఈ విషయం గురుదేవులకి బాగా తెలుసు. ఈ ఆధునిక యుగంలో మానవుడు ఒకటి లేక రెండు యోగాలు సాధన చేస్తే సరిపోదని ఆయనకి తెలుసు కాబట్టి, వారికి సహాయం చేయటానికి ఆయన తన 16 మంది శిష్యుల జీవిత చరిత్రల ద్వారా 16 యోగాలను అనుగ్రహించారు. వారి ద్వారా భగవత్సాక్షాత్కార పద్ధతిని ఆయన తెలిపారు. వాటిలో ఏ పద్ధతి ననుసరించాలన్నది ఇక మనకే వదిలేశారు. మన తత్త్వాన్నిబట్టీ, సంస్కారాన్నిబట్టీ మనం ఒకటి, లేక రెండు లేక 16 యోగాలూ అనుసరించి, పరమార్థాన్ని పొందవచ్చు.

శ్రీరామకృష్ణుల షోడశ ప్రత్యక్ష శిష్యుల జీవితాలను పరిశీలించి, అవగాహన చేసుకొని, వారి జీవితాలలో వారు అనుసరించిన ప్రత్యేక

యోగాల ద్వారా భగవంతునితో అత్యంత సన్నిహిత, ఆధ్యాత్మిక సంబంధాలు ఏర్పరచుకునే విధానాల గురించి తెలుసుకుందాం.

## 1. అనుభవ యోగం

అసత్యమైన దానిని సత్యంగా, సత్యమైన దానిని అసత్యంగా భావించటమే ధర్మగ్లాని. ఇంద్రియ గోచరమైన ప్రపంచం మనకు సత్యంగా అనిపించినా, శాస్త్రాలు బ్రహ్మమొక్కటే సత్యమనీ, ప్రపంచం అసత్యమైనదనీ తెలుపుతున్నాయి. ఈ ప్రపంచంలో ప్రతి ఒక్కటీ నశించి తీరుతుంది. ఈ మారుతున్న ప్రపంచం వెనుక శాశ్వతమైన, ఎన్నటికీ మారని ఏకైక సత్యం, చైతన్యం ఒకటున్నది. ఈ సత్యం స్థూలమైన, అపవిత్రమైన మనస్సుకు గానీ, ఇంద్రియాలకుగానీ గోచరంకాదు. ఇంద్రియాతీతమైన ఈ సూక్ష్మాతిసూక్ష్మమైన సత్యాన్ని గ్రహించటం, సునిశితమైన మేధాశక్తిని అలవరచుకున్న ఏ కొద్దిమందికోగాని సాధ్యం కాదని కఠోపనిషత్తు తెలుపుతోంది. అటువంటివారే తెలివైనవారని ఆ ఉపనిషత్తులో తెలుపబడింది. ఈ ప్రపంచంలో అన్ని వాంఛలూ, బంధాలూ వదులుకుంటే తప్ప, ఈ సత్యాన్ని గ్రహించలేరు. ఈ ఆదర్శాన్ని గ్రహించలేని బలహీన మనస్కులు, ఇది ఆచరణయోగ్యం కానిదని ప్రకటించి, ఆ ఉన్నత ఆదర్శాన్ని తమ స్థాయికి దిగజార్చటానికి ప్రయత్నిస్తారు. అటువంటివారు అన్ని రకాల దుష్ట సాధనల, మూఢ నమ్మకాల, సిద్ధాంతాలను అనుసరించి మతం పేరిట హింసను ప్రోత్సహిస్తారు. భగవద్విషయాలను వదలివేసి, వారు ఊహాజనిత భ్రమల గురించి, బాహ్యవిషయాల గురించి వృధాగా పోరాడుతుంటారు.

యథార్థ మతాన్ని గురించి తెలియజేయటానికి శ్రీరామకృష్ణులు తనతోపాటు నరేంద్రనాథుని తీసుకువచ్చారు. మతం సిద్ధాంతాలలో గానీ, మాటలలో గానీ లేదనీ, భగవంతుని నిజతత్త్వం గ్రహించటమే మతమనీ నరేంద్రుని ద్వారా ఆయన ఈ ప్రపంచానికి ప్రదర్శించి చూపారు.



ఆధునిక యుగపు సందిగ్ధావస్థతో, సందేహాలతో మతంలోని ఉన్నత సత్యాలనుగూడ రుజువులేనిదే విశ్వసించని దృక్పథంతో, నరేంద్రుడు శ్రీరామకృష్ణుల వద్దకు వచ్చాడు. కానీ తనలోని సత్యాన్ని తెలుసుకోవాలనే దృఢమైన ఆకాంక్ష, పట్టుదల ఆయనలో వున్నాయి. శ్రీరామకృష్ణులను ప్రప్రథమంగా ఆయన ''అయ్యా! మీరు దేవుణ్ణి చూశారా?'' అని ప్రశ్నించారు. శ్రీరామకృష్ణుల నుంచి సూటిగా ఈ సమాధానం వచ్చింది: ''అవును, చూశాను - అంతేకాదు నేను నిన్ను యిప్పుడు చూస్తున్నట్లుగా ఆయన్ను చూస్తున్నాను. అంతేకాదు మరింత స్పష్టంగా దర్శిస్తున్నాను.'' ఇంకా ఆయన ఈ విధంగా అన్నారు: ''దైవసాక్షాత్కారం తప్పక సాధ్యమవుతుంది. నేను నిన్ను చూస్తూ, మాట్లాడుతున్న విధంగా దేవునితో గూడ మాట్లాడవచ్చు, చూడవచ్చు. కానీ, ఎవరికంత శ్రద్ధ, ఆవేదనా వున్నాయి? మనుష్యులు తమ భార్యల కోసం, బిడ్డల కోసం, సంపద కోసం, ఆస్తి కోసం అశ్రుధారలు కురిపిస్తారు గానీ భగవంతుని కొరకెవరైనా ఆ విధంగా చేస్తారా? దైవం కోసం మనస్పూర్తిగా విలపిస్తే, ఆయన తప్పక ప్రత్యక్షమవుతాడు.''

గురుదేవులు చెప్పిన ప్రతి విషయాన్నీ వెంటనే అంగీకరించే వ్యక్తికాదు నరేంద్రుడు. అతడు సందిగ్ధ మనస్కులైన ఆధునిక మానవులకు సరియైన ప్రతినిధి. అతను గురుదేవులతో బాగా వాదించాడు. ఆ వాదనలో ఎంత స్థాయికి వెళ్ళాడంటే, గురుదేవులకు కలిగే దర్శనాలూ, అనుభూతులూ, దృశ్యాలూ, అన్నీ ఆయన మనోజనిత కల్పనలే అనిగూడా అనేవాడు. బ్రహ్మసమాజ సభ్యుడయినందున విగ్రహం ఎదుట మోకరిల్లి, నమస్కరించటం మూఢనమ్మకంగా, ఛాందసంగా అతనికి అనిపించేది. భవతారిణీమాత ఆలయాన్ని నిత్యం సందర్శించే శ్రీరామ కృష్ణులను అతను హేళన చేసేవాడు. అతను దైవాన్ని సాకారమనిగానీ, నిరాకారమనిగానీ, ఏదీ విశ్వసించేవాడు కాదు. ఒకరోజు నరేంద్రుడు, హాజ్రా కలిసి దైవం యొక్క నిరాకార తత్త్వాన్ని ఖండిస్తూ, ప్రతి ఒక్కటీ

మాట్లాడుకోవటం గురుదేవులు
ప్రేమే అనటం దోషపూరితమైనదని మాట్లాడుకోవటం గురుదేవులు శరీరాన్ని తన
విన్నారు. గురుదేవు లేమీ మాట్లాడలేదు కానీ నరేంద్రుని శరీరాన్ని తన
ప్రసాదంతో సున్నితంగా స్పృశించారు. గురుదేవుల ఈ అద్భుత స్పర్శ
నరేంద్రునిలో గొప్పమార్పును తీసుకొచ్చింది. మూడు రోజులు రాత్రిం
బవళ్ళూ నరేంద్రుడు ప్రతిచోటా అఖండ చైతన్యాన్ని దర్శించగలిగాడు.

శ్రీరామకృష్ణుల గొప్పతనం యిదే! ఆయన తన శిష్యులను ఎంతో
సహనంతో శిక్షణ యిచ్చి, తీర్చి దిద్దారు. నరేంద్రుణ్ణి, మేధాశక్తితో సంతృప్తి
పరచి, సమాధానపరచటం కష్టమని తోచినపుడు, మనస్సుకూ, మేధాశక్తికీ
అతీతమైన తన అద్భుత స్పర్శద్వారా ఆయన సత్యానుభూతి పొందేటట్లు
చేశారు. మతం తర్కానికి అందేది కాదనీ, అనుభూతికి చెందినదనీ
అపుడిక నరేంద్రుడు అంగీకరించక తప్పలేదు. ఆ తరువాత రోజులలో
నరేంద్రుడు మతం అంటే అనుభూతేననీ, మానవునిలో సహజంగా వున్న
దివ్యత్వాన్ని ప్రకాశింపచేసేదే మతమనీ బహిరంగంగా ప్రకటించాడు.

భవతారిణీమాత విగ్రహంలో జగన్మాత సజీవాకృతిని నరేంద్ర
నాథునికి శ్రీరామకృష్ణులు చూపారు. నరేంద్రుడు అది అంగీకరించాక,
శ్రీరామకృష్ణుల వదనం దివ్యానందంతో ప్రకాశించింది. నరేంద్రుడు
అమ్మని అంగీకరించాడని శ్రీరామకృష్ణులు అందరితో మహదానందంగా
చెప్పారు.

నరేంద్రుడు శాస్త్రాలలో దిట్ట. అతను పాశ్చాత్య మానసిక శాస్త్రం,
తత్త్వం, దర్శనాలు అధ్యయనం చేశాడు. అతను ఎంతో మంది మహాత్ము
లను కలుసుకున్నాడు. కానీ దేవుని ఉనికి గురించి అతనికి ఎవరూ సరైన
సమాధానమూ, అవగాహనా యివ్వలేకపోయారు.

శ్రీరామకృష్ణులు నరేంద్రనాథ్ (వివేకానందస్వామి) ని ధర్మస్థాపనకై
తనతో తీసుకువచ్చారు. అతని జీవితం ద్వారా మహాత్ముల మాటలు సత్యా
లని ఆయన నిరూపించారు. వాటి గురించి చదవటం, చర్చించటం సరి
పోదనీ, ఆ సత్యాన్ని ఎవరికి వారు స్వయంగా అనుభవించాలనీ తెలిపారు.



గురుదేవులు నరేంద్రుని మనస్సు నుండి సంశయ రాక్షస వినాశం చేసి, మతంలోని సత్యానుభూతిని పొందేటట్లు చేశారు. వివేకానందస్వామి ఒక రచనలో ఈ విధంగా అన్నారు: 'మానవుల మనస్సుల నుండి సంశయ రాక్షస వినాశంచేసే అస్త్రం వంటి గురుదేవులకి ప్రణామం చేస్తున్నాను.'

భగవంతుని ఉనికిలో విశ్వాసం కలిగివుండక తమ ఉన్నత మేధా శక్తిమీదే ఆధారపడేవారి ఉద్ధరణ నిమిత్తం శ్రీరామకృష్ణులు మహోన్నత మేధాశక్తిగల నరేంద్రుని భువికి తీసుకొచ్చి, మతమంటే పుస్తకాలలో లేదనీ మేధాశక్తి యొక్క గారడీకాదనీ, అదొక అనుభూతి చెందవలసిన విషయ మనీ ప్రపంచానికి చాటారు. ఆ విధంగా, ఈ కొత్త ''అనుభవయోగాన్ని'' ఆధునిక సందిగ్ధ మనస్కులకు ఆయన అనుగ్రహించారు.

## 2. వాత్సల్య యోగం

ఈ ప్రపంచంలో అత్యంత పవిత్రమైన, నిస్వార్థమైన, సహజంగా, అంతర్గతంగా ప్రవహించే ప్రేమ తల్లిప్రేమ (తల్లికి పసిబిడ్డపై, బిడ్డకు తల్లిపై ప్రేమ). దీనిని భగవంతుని వైపు మరలిస్తే, దైవసాక్షాత్కారం తప్పక లభిస్తుంది. బిడ్డ ఎల్లపుడూ తల్లి చేతులలో, సమక్షంలో హాయిగా, క్షేమంగా ఉంటుంది. తల్లే ఆమెకు రక్ష, బలం! నిస్సహాయంగా వున్న పిల్లిపిల్ల రక్షణకై తన తల్లిపై పూర్తిగా ఏ విధంగా ఆధారపడుతుందో, బిడ్డ కూడా తల్లిపై ఆ విధంగానే ఆధారపడుతుంది. అదేవిధంగా భక్తుడు సర్వ కాలసర్వావస్థలయందు భగవంతుడినే తాను ఆధారపడతగిన తల్లిగా భావిస్తాడు.

జగజ్జనని ముద్దుబిడ్డ శ్రీరామకృష్ణులు తన జీవితంలో వాత్సల్య భావాన్ని అనుష్ఠించారు. ఆయనకు భవతారిణీమాతయే నిత్యసత్యమైనది. ప్రతివిషయానికీ ఆమెపైనే ఆయన పూర్తిగా ఆధారపడేవారు. ఆయన ఆవేదనాభరిత హృదయాన్నీ, గాఢప్రేమనూ గమనించిన తల్లి దూరంగా వుండలేక, ఆయన ఎదుట సజీవంగా దర్శనమిచ్చింది. రాతితోగానీ,

లోహంతోగానీ చేయబడిన జడప్రతిమగా కాక, చిన్మయమూర్తిగా, చైతన్యవంతంగా ఆమె కనుపించసాగింది. నిరంతరాయంగా జగదంబ సజీవ సమక్షాన్ని ఆయన అనుభవించసాగారు.

ఇతరు లెవరూ తనను గురువనికానీ, ఉపదేశకుడనిగానీ, తండ్రీ అనిగానీ సంబోధించటం గురుదేవులకి నచ్చేదికాదు. అటువంటప్పుడు, ఆయనతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకొని, ప్రేమించి, ఆయనను మన స్వంతం చేసుకోవటం ఎలా?

ఆధ్యాత్మికంగా బలహీనులైనవారికీ, తీవ్రసాధనలు చేయటానికి తగినంత శక్తి లేనివారికీ సహాయం చేయటం కోసం, దయతో గురుదేవులే తగు మార్గం చూపారు. యశోదకు బాలకృష్ణునిపై గల దివ్యప్రేమనూ, తనకూ భవతారిణీమాతకూ మధ్యగల దివ్యప్రేమనూ ప్రకటించటానికి ఈ యుగావతారులైన శ్రీరామకృష్ణులు తనతోపాటు రాఖాల్ (బ్రహ్మానంద స్వామి) అనే దివ్యశిశువును తీసుకువచ్చారు. భగవంతుణ్ణే తల్లిగా ప్రేమించి, తద్వారా సాక్షాత్కారం చేసుకొనే విధానాన్ని ఆయన ద్వారా శ్రీరామకృష్ణులు ప్రపంచానికి ప్రదర్శించారు.

గురుదేవులు ఈ విధంగా చెప్పారు: ''రాఖాల్ ఇక్కడికి వచ్చే కొద్ది రోజులకు మునుపే, జగన్మాత నా ఒడిలో ఒక పసిబిడ్డను ఉంచి 'ఇతడే నీ పుత్రుడు' అన్నది. ఈ వాక్కు నాకు కలవరం కలిగించి, వెంటనే ఆమెను విభ్రమంతో 'ఏమిటమ్మా? ఏమిటి నువ్వంటున్నది? నాకు పుత్రుడా?' అని అడిగాను. అప్పుడామె మందహాసంతో 'ఆ శిశువు ఆధ్యాత్మిక శిశువనీ, మామూలు శిశువు కా'దనీ నన్ను ఊరడించింది.''

తల్లి తన బిడ్డపట్ల ఏ విధంగా ప్రవర్తిస్తుందో శ్రీరామకృష్ణులు రాఖాల్‌తో ఆ విధంగా ప్రవర్తించేవారు. అదే విధంగా రాఖాల్ గూడా 18 ఏళ్ల యువకునివలె గాక పసిబిడ్డవలె శ్రీరామకృష్ణులతో ప్రవర్తించేవాడు. అది మానవ అవగాహనకు అతీతమైన ఒక గుహ్యాతిగుహ్యమైన బాంధవ్యం.



సాధారణ సాంసారిక జీవితంలో అనారోగ్యంతో బాధపడుతున్న బిడ్డపై తల్లి ఏ విధంగా ప్రత్యేక ప్రేమ చూపుతుందో, అదేవిధంగా తనపై పూర్తిగా ఆధారపడే భక్తుని తన అమాయకపు బిడ్డగా భగవంతుడు భావిస్తాడు. గురుదేవులకు రాఖాల్‌పట్ల గల ప్రేమ రాఖాల్ జీవితంలోని ఈ క్రింది సంఘటనలు చక్కగా నిరూపిస్తాయి. గురుదేవులు తనపట్ల చూపిన ప్రేమ తన స్వంతతల్లి ప్రేమకన్నా గాఢమైనదని రాఖాల్ భావించేవాడు. ఒకసారి రాఖాల్ అనారోగ్యంగా ఉన్నాడు. గురుదేవులు అతని గురించి చాలా ఆందోళన చెందుతూ, భక్తులతో ఈ విధంగా అన్నారు: ''చూడండి! రాఖాల్‌కు ఒంట్లో కులాసాగా లేదు. సోడానీరు అతనికేమైనా ఉపశమనం ఇస్తుందా? నే నిపుడేమి చేయాలి? రాఖాల్! కొద్దిగా జగన్నాథుని ప్రసాదం తిను బాబు!'' ఈ మాటలు అంటూ రాఖాల్‌ను మాతృవాత్సల్యంతో అత్యంత కరుణాదృష్టితో చూస్తూ, ప్రేమగా గోవిందనామ స్మరణ చేశారు.

ఆ తరువాతి రోజులలో గురుదేవులే స్వయంగా రాఖాల్‌కు తనపట్ల గల భావాలను ఈ విధంగా వ్యక్తపరిచారు: ''ఆ రోజులలో రాఖాల్ తత్వం 3-4 ఏళ్ల పసిబాలుని మనస్తత్వంవలె ఉండేది. నన్ను తన స్వంత తల్లివలెనే భావించేవాడు. పరిగెత్తుకుంటూవచ్చి నా ఒడిలో కూర్చునేవాడు. అక్కడి నుంచి కొంచెంకూడా పక్కకి కదిలేవాడు కాదు. తన ఇంటికి వెళ్ళాలని అనుకొనేవాడే కాదు. అతనిని సంతోషపరచటానికి అప్పుడప్పుడూ నేను అతనికి అన్నం తినిపించేవాడిని, అతనితో ఆడుకునేవాడిని, ఆ తరువాత నా భుజాలమీద ఎక్కించుకొని తిప్పేవాడిని.''
రాఖాల్ అమాయకత్వం చూసి గురుదేవు లొకసారి, పూర్తిగా వివశులయి, అశ్రుపూరిత నయనాలతో ''నువ్వింత అమాయకంగా ఉన్నావే! నేను పోయిన తరువాత నిన్నెవరు చూస్తారు?'' అన్నారు.

బిడ్డ ఏదైనా తప్పు చేస్తే, బిడ్డ బాగుకోసం తల్లి తిట్టడానికిగానీ, కొట్టడానికిగానీ వెనుదీయదు. అదేవిధంగా గురుదేవులు కూడా తన

ఆధ్యాత్మిక శిశువైన రాఖాల్‌ను అతని బాగుకోసం బాగా మందలించేవారు. ఒకరోజు రాఖాల్ (శ్రీరామకృష్ణుల కోసం వేచి ఉండకుండా దేవాలయ ప్రసాదంలోని వెన్నను తినేశాడు. గురుదేవు లతన్ని మందలిస్తూ, "నువ్వెంత ఆశపోతువు! ఇక్కడ యిన్నాళ్ళ బట్టీ ఉంటున్నావు. నిన్ను నీవు వశంలో ఉంచుకోలేకపోతున్నావే?" అన్నారు. ఆ విధంగా గురుదేవులు ప్రేమించే తల్లిగా, దండించే తండ్రిగా రెండు పాత్రలను పోషించి, తన ఆధ్యాత్మిక శిశువుకి శిక్షణ నిచ్చారు.

తల్లి తన బిడ్డకి ఎప్పుడూ ఏదో తినిపించాలనుకుంటుంది. బిడ్డ కాలేకడుపుతో వున్నా, ఆహారంలేక అలమటిస్తున్నా చూసి సహించలేదు. భగవంతుడు గూడా తన బిడ్డలు ఆకలితో వుంటే చూడలేడు. ఆయన తన బిడ్డలకి సహాయం చేయటానికి ఎల్లపుడూ సిద్ధంగా వుంటాడు. కానీ దురదృష్టవశాత్తూ ఆయనతో శాశ్వత సంబంధాన్ని కలిగి ఉన్నామని మనం మరచిపోతుంటాం. ఆయనే మన తల్లీ, తండ్రీ, సర్వస్వమూ! ఆయనతో ఈ మధురమైన "మాతా-శిశువు" బాంధవ్యం, సన్నిహితత్వం ఏర్పరచుకుంటే, మన అవసరాలన్నీ తప్పక ఆయనే సమకూరుస్తాడు.

ఒక రోజు రాఖాల్ చాలా ఆకలిగా ఉందని గురుదేవులకి తెలిపాడు. గురుదేవుల గదిలో ఏవిధమైన ఆహారమూ లేదు. అందుకని గురుదేవులు గంగానది గట్టుపై నిలబడి బిగ్గరగా, 'ఓ గౌరీదాసీ! దయచేసి త్వరగా రా! నా రాఖాల్ చాలా ఆకలిగొని వున్నాడు' అని అరిచారు. కొంతసేపయిన తరువాత రసగుల్లాలు తీసుకొని బలరాం, గౌరీ దక్షిణేశ్వరం నుండి పడవలో వచ్చారు. వారిని చూచిన వెంటనే గురుదేవులు, 'రాఖాల్! రా! వాళ్ళు రసగుల్లాలు తీసుకువచ్చారు. నువ్వు ఆకలిగా వున్నావుగదా! త్వరగా వచ్చి, తిను!' అని పిలిచారు.

రాఖాల్ గురుదేవులను తన స్వంత తల్లిలాగానే ప్రేమించాడు. అందుకు బదులుగా, అతని లౌకిక, ఆధ్యాత్మిక సంక్షేమానికి కావలసిన



అవసరాలన్నీ గురుదేవుల నుంచి లభించాయి. రాఖాల్ జీవితం ద్వారా గురుదేవులు వాత్సల్యయోగాన్ని ప్రదర్శించారు. గురుదేవుల బిడ్డగా తమను తాము భావించి, ఆయన్ను తమ స్వంత తల్లివలె ప్రేమించినవారందరూ ఈ జీవితంలోనే సుఖశాంతులు, ఆనందం, ధన్యత పొందగలరు.

## 3. భక్త - భగవాన్ యోగం

ఒకరోజు భాగవతం వింటుండగా శ్రీరామకృష్ణులు భావసమాధి స్థితిలో ప్రవేశించి, తేజోమయంగా ప్రకాశిస్తున్న శ్రీకృష్ణ రూపం గాంచారు. ఆ రూపం పాదాలనుండి ఒక జ్యోతికిరణం వెలువడి భాగవత గ్రంథాన్ని తాకి అక్కడి నుండి గురుదేవుల హృదయాన్ని స్పృశించి, ఆ తరువాత ఆ మూడిటినీ (శ్రీకృష్ణ రూపం, భాగవతం, గురుదేవుల హృదయం) తాకుతూ ఆ జ్యోతి కొంతసేపు అదేవిధంగా ఉండిపోయింది. ఈ దృశ్యంతో, భక్తుడు, భాగవతము, భగవంతుడు వేరువేరు కాదనీ, ఆ మూడు ఒకటేనన్న నమ్మకం గురుదేవులకి కలిగింది.

భక్తుల హృదయంలో భగవంతుడు క్రీడిస్తుంటాడు కాబట్టి భక్తులందరూ ఒక ప్రత్యేక తరగతికి చెందినవారని గురుదేవుల దృఢవిశ్వాసం. భక్తునిలో దివ్యత్వం ప్రత్యేకంగా ప్రకటితమవుతుంది కాబట్టి గురుదేవు లీవిధంగా అనేవారు: 'భక్తుని హృదయం భగవంతుడు ఆసీనుడై ముచ్చటించే గది. అందుచేత, భక్తులను పూజిస్తే, భగవంతుణ్ణే స్వయంగా పూజించినట్లవుతుంది.' ఈ 'భక్త-భగవాన్' యోగాన్నే గురుదేవులు ఈ ప్రపంచానికి ప్రసాదించారు.

భక్తి గ్రంథాలు ఈవిధంగా చెబుతున్నాయి: "భగవంతుని పట్ల భక్తిగలవారు మాత్రమే నిజమైన భక్తులుకారు. భక్తుల పట్ల భక్తికలవారే నిజమైన భక్తులు."

తమ మాటలతోగాని, ఆలోచనలతోగాని, చేతలతోగాని ఎవ్వరూ భక్తులకు హాని తలపెట్టగూడదని గురుదేవులు భావించేవారు. ఎందువల్ల

నంటే అది భక్తుని హృదయంలో నివసించే భగవంతునికే హాని చేయటమవుతుంది. అంతేగాక అది పాప కృత్యం. లాటూమహరాజ్ (అద్భుతానందస్వామి) జీవితంలోని ఈ క్రింది సంఘటన గురుదేవులకి భక్తుల పట్లగల మనఃపూర్వక ప్రేమను, వ్యాకులతను తెలియజేస్తుంది.

దక్షిణేశ్వరంలో ఒకరోజు ఒక భక్తుడు చెడుగా ప్రవర్తించాడు. లాటూమహరాజ్‌కి అతనిపై చాలా కోపంవచ్చి, తీవ్రంగా మందలించాడు. గురుదేవు లీ విషయాన్ని గమనించి, ఆ భక్తుడు వెళ్ళగానే లాటూతో గురుదేవు లీవిధంగా అన్నారు: ''ఇక్కడికి వచ్చేవారితో కఠినంగా మాట్లాడటం మంచిదికాదు. వారందరూ ప్రాపంచిక సమస్యలతో విసిగి వేసారి ఉంటారు. వారిక్కడికి వచ్చాక, వారి తప్పిదాలకి, లోటుపాట్లకి యింత కఠినంగా తిడితే వారెక్కడికి వెళతారు? సత్సాంగత్యంలో ఉన్నపుడెప్పుడూ, ఎవరిపైనా కఠినపదాలు ఉపయోగించకు! ఇతరులకు బాధ కలిగించే మాటలు ఎన్నడూ మాట్లాడకు. రేపు అతనివద్దకు వెళ్ళి క్షమాపణ కోరు. ఆ విధంగానైనా అతను నీ వీరోజు మాట్లాడిన మాటలు మరచిపోతాడు.''

''భక్తులసేవ-ప్రేమ'' మార్గాన్ని ప్రదర్శించటానికి గురుదేవులు గృహస్థ భక్తులలో ముఖ్యుడయిన శ్రీరామచంద్రదత్తను ఎంచుకున్నారు. గురుదేవుల ఆదేశానుసారం, అతను కంకూర్‌గాచ్ఛిలో ఒక స్థలం కొని, అక్కడ భక్తులకి ఆహారం సమకూర్చి, సేవిస్తూ వుండేవాడు. ఆ విధంగా సన్యాస శిష్యులలో ''భక్త-భగవాన్ యోగము'' అంటే భక్తులసేవే భగవంతుని సేవ అనే యోగాన్ని ప్రదర్శించే బాధ్యత బాబూరాం మహరాజ్ (ప్రేమానందస్వామి)కి ఈయబడింది.

ప్రేమానందస్వామి మూర్తీభవించిన ప్రేమస్వరూపం. భక్తుల సేవ ద్వారా యిది వ్యక్తీకరింపబడేది. గురుదేవుల భక్తులను సేవించటం తనకు లభించిన గొప్పవరంగా ఆయన భావించేవారు. ఆయన చేసే సేవలో విశేషమేమంటే, భక్తులను సేవించటంలో ఆయన ఎన్నడూ అలసట



చెందేవారు కాదు. ఒక నిర్ణీత సమయమేమీలేక, రాత్రింబవళ్ళూ ఆయన భక్తుల సేవకు సిద్ధంగా ఉండేవారు. ఆయనకు అసలు అహంకారమే ఉండేదికాదు. తాను సన్యాసిని కాబట్టి యితరులకన్నా అధికుడననే భావం ఆయన మనసులో ఒక్కసారి కూడా మెదలలేదు. వినయపూర్వకమైన సేవకునివలె ఆయన భక్తులను సేవించేవారు. ఏ విధమైన విసుగూలేక తన అన్నవస్త్రాదులు, సుఖాలు సర్వమూ త్యాగంచేసి భక్తులను సేవించటానికి ఎప్పుడూ ఆయన సర్వసన్నద్ధులై ఉండేవారు. భక్తులెవరూ మఠం నుండి ప్రసాదం తీసుకోకుండా వెళ్ళటానికి ఆయన అనుమతించేవారు కాదు. గురుదేవుల ప్రసాదం అద్భుతాలను చేయగలదని ఆయన పరిపూర్ణ విశ్వాసం. ఆ ప్రసాదం వారి మనస్సులను పవిత్రం చేసి, గురుదేవులపై ప్రేమనూ, భక్తినీ పెంపొందిస్తుందని ఆయన భావించేవారు.

హృదయాన్ని కదలించే సంఘటన లెన్నో ఆయన జీవితంలో ఉన్నాయి. భక్తుల పట్ల ఆయనకు గల సేవాభావాన్ని తెలియజేయటానికి 1-2 సంఘటనలు సరిపోతాయి. ఒకసారి మద్రాసు నుండి వచ్చిన ఒక భక్తుడు మఠం మేడపైన వసారాలో నిద్రపోతున్నాడు. ప్రేమానందస్వామి అర్ధరాత్రి సమయంలో అది చూశారు. వెంటనే ఆయన అతను పడుకున్న చోట దోమతెర ఏర్పాటుచేసి, తానే స్వయంగా అతనికి విసనకర్రతో వీచసాగారు. ఆ భక్తుడు లేచి ప్రేమానందస్వామి తనకు విసనకర్రతో వీచటం చూసి విస్మయం చెందాడు.

మరొక సందర్భంలో మఠానికి చాలామంది భక్తులు వచ్చారు. వారు చెప్పులు మఠ ప్రాంగణంలో వదిలి, దేవాలయానికి వెళ్ళారు. ఇంతలో వాన ప్రారంభమయింది. ఒక బ్రహ్మచారి వరండాలోకి పరిగెత్తుకుంటూవచ్చి ఆ చెప్పులు లోపలికి తీసుకువెళ్ళటానికి, తన కాళ్ళతో ఆ చెప్పులను ఎత్తసాగాడు. ఆ బ్రహ్మచారికి కలిగిన ఆధిక్యతాభావాన్ని గమనించి, ప్రేమానందస్వామి అతనితో, 'ఆ భక్తుల చెప్పులు నీ శిరస్సుపై ధరించి తీసికెళ్ళు' అన్నారు.

యువసన్యాసులలో ఏ విధమైన అలజడి, విసుగూ గమనించినా ప్రేమానందస్వామి ఈ విధంగా అనేవారు: ''చూడండి! మనుషులు ఈ ప్రపంచంలో ఎన్నో కష్టాలు పడుతున్నారు. శ్రీరామకృష్ణుల ఈ ప్రదేశానికి వారు శాంతి పొందటానికి వస్తారు. వారికి స్వాగతం పలకటం మీ అందరి విధ్యుక్త ధర్మం. అది మీకూ, వారికీ గూడా ఎంతో మేలు కలుగ జేస్తుంది.''

ఉద్బోధన్ గృహంలో మరణశయ్యపై ఉన్నపుడు గూడ ఆయన నిరంతరం భక్తుల క్షేమం గురించే యోచిస్తుండేవారు. ఆ సమయంలో బేలూరు మఠం నుండి బ్రహ్మచారి జ్ఞాన్ మహరాజ్‌ని పిలిపించి, బలహీన మైన స్వరంతో ఈ విధంగా అడిగారు: 'జ్ఞాన్! గురుదేవుల భక్తులకు సేవచేయగలవా?' జ్ఞాన్ మహరాజ్ ఆ విధంగానే చేస్తానని వాగ్దానం చేశాక, ప్రేమానందస్వామి అమిత శాంతితో తమ భౌతిక శరీరాన్ని త్యజించారు. ప్రేమానందస్వామి మహాసమాధి వార్త బేలూరు మఠం చేరగానే, బ్రహ్మా నందస్వామి చిన్న పిల్లవానివలె బిగ్గరగా విలపిస్తూ, ''బేలూరు మఠం తన తల్లిని కోల్పోయింది'' అని వ్యాఖ్యానించారు.

ఆ విధంగా భక్తులను తల్లివలె ప్రేమించి సేవించటం ద్వారా సులభంగా మానవ జీవిత పరమార్థాన్ని చేరుకోవచ్చునని ప్రేమానంద స్వామి జీవితం ద్వారా గురుదేవులు ఈ ప్రపంచానికి బోధించారు.

## 4. జీవ - శివ యోగం

భక్తసమూహంలో వైష్ణవ మత సిద్ధాంతాల గురించి చర్చిస్తూ, శ్రీరామకృష్ణులు ''జీవులను శివునివలె సేవించు'' అనే మహామంత్రాన్ని ఉచ్చరించారు. ఆయన ఈ విధంగా అన్నారు: 'జీవులపట్ల దయ చూపటమా! జీవులపట్ల దయచూపటమా! మూర్ఖుడా! భూమిపై ప్రాకులాడే అత్యల్పమైన జీవివి. ఇతరులపై దయచూపుటకు నీ వెవరవు? దయచూపుటకు నీ వెవరవు? కాదు! ఆ విధంగా చేయలేవు. ఇతరులపై



దయకాక, మానవుని సాక్షాత్తూ భగవంతునిగా భావించి, గుర్తించి, సేవించటమే నీవు చేయగలిగింది-చేయవలసింది.'

గురుదేవులు ఈ మాటలు అంటున్నపుడు నరేంద్రనాథ్ (వివేకా నందస్వామి) అక్కడే వున్నాడు. ఆ మాటలలోని మహత్త్వాన్నీ, అంతర్గత భావాన్నీ, అతనొకడే గ్రహించగలిగాడు. గొప్ప భావావేశంతో అత నీ విధంగా అన్నాడు: ''భగవంతుని ఇచ్ఛవుంటే, నే నీ రోజున విన్న గొప్ప సత్యాన్ని ప్రపంచమంతా విస్తృతంగా చాటే రోజు త్వరలో వస్తుంది. సత్యాన్ని మేధావులు, మూర్ఖులు, సంపన్నులూ - పేదలూ, బ్రాహ్మణులు - పాకీవారూ - అందరికీ సమంగా వర్తించే సంపదగా చేస్తాను.''

శాస్త్రాలు భగవంతుణ్ణి మహోన్నతునిగా, శ్రేష్ఠునిగా వర్ణిస్తాయి. ఆయనే అనేక జీవులుగా రూపొందాడు. అంతేగాక, వారికి అతీతంగా కూడా వున్నాడు. మానవుడిని భగవంతుని ప్రత్యక్షమూర్తిగా భావిస్తూ, మానవుని సేవించిన సాధకుల హృదయాలు పవిత్రమైపోతాయి. చివరికి ఈ సేవయే తన నిజతత్త్వాన్ని తెలుసుకోవటానికి దోహదపడుతుంది. వివేకానందస్వామి ఈ మహోన్నత సత్యాన్ని బోధించి, ఆచరణ యోగ్య మైన ''అనుష్ఠాన వేదాంతం'' పేరుతో అందరికీ తెలిసేటట్లు చేశారు. దురదృష్టవశాత్తూ, ఆయన చాలా స్వల్పకాలమే జీవించారు. వారి తరువాత ఈ జీవ-శివయోగాన్ని తన జీవితం ద్వారా ప్రదర్శించవలసిన బాధ్యత అఖండానందస్వామికి దక్కింది. వివేకానందస్వామి అఖండానందస్వామికి అమెరికా నుండి అనేక ఉత్తేజపూరితమైన లేఖలు వ్రాసి సేవాకార్య క్రమాలలో పూర్తిగా నిమగ్నమవమని ప్రోత్సహించారు. వారికి వ్రాసిన ఒక లేఖలో, ఆయన ఇతరులకు మేలు చేయటం కోసం అవసరమైతే గడ్డి తినయినా జీవించు అని వ్రాశారు... పేదవారు, నిరక్షరాస్యులు, అజ్ఞా నులు, పతితులు-వీరినే నీ దైవాలుగా భావించు. వీరి సేవయే మహోన్నత - మతమని తెలుసుకో! అని వ్రాశారు.

తన పరివ్రాజక జీవితంలో అఖండానందస్వామి పేదల సేవ కొరకు తన జీవితాన్నే అంకితం చేసిన డా॥ ఝుండు భట్ అనే వ్యక్తిని కలుసుకున్నారు. ఆయన తరచూ, తన జీవిత తత్త్వాన్నీ, సిద్ధాంతాన్నీ తెలిపే ఈ క్రింది అర్థంగల శ్లోకాలను పఠించేవారు: 'ఓ పరమాత్మా! నాకు రాజ్యం వద్దు, స్వర్గ సుఖాలు వద్దు, జనన మరణ వలయం నుంచి విముక్తీ వద్దు, కానీ జీవితంలో ఆర్తులు, దుఃఖితులూ అయినవారి బాధలు సమసిపోవాలని మాత్రం కోరుకుంటాను.'

స్వామీజీ ప్రోత్సాహమూ, పేదల సేవకై డా॥ ఝుండు భట్ అంకిత భావమూ, అఖండానందస్వామి హృదయంలో పేదవారి పట్ల అనుకంపను రేకెత్తించాయి. ఇతరులను ప్రేమించి, సేవించటమే మహోన్నతమైన ఆదర్శమని ఆయన దృఢంగా భావించారు.

అఖండానందస్వామి 1894 నుండి తన పథకం ప్రారంభించారు. అప్పుడు ఆయన వయస్సు 28 సంవత్సరాలు మాత్రమే. అప్పటినుండి జీవితాంతం ఆయన బాధిత, పీడిత, అజ్ఞ, నిర్లక్ష్యిత ప్రజలను సాక్షాత్తూ దైవంగా భావించి, సేవించారు.

ఆయన వివిధ ప్రదేశాలలో తీవ్రసాధనలు చేస్తూ, పరివ్రాజక సన్యాసిగా కాలం గడిపారు. కానీ యిపుడాయన గురుదేవుల యిచ్ఛ వేరుగా వున్నదని గ్రహించి, ఆయన తనను సేవాసాధనను ఆచరించమని ఆదేశించినట్లు భావించారు.

తన సేవా సాధనను ఆయన ఖేత్రీ నుంచి ప్రారంభించారు. బాధల కన్నిటికీ మూలకారణం ప్రజల అజ్ఞానమని ఆయన తెలుసుకున్నారు. అందుకని ''విద్య''ను ఆయన ముఖ్యలక్ష్యంగా ఎంచుకున్నారు. ఖేత్రీలో యింటింటికీ తిరిగి పిల్లలకి చదువు నేర్పించవలసిన అగత్యం గురించి ఖేత్రీవాసులకు నచ్చజెప్పారు. తీవ్రకృషి వలన అచటి ఉన్నత పాఠశాలలో విద్యార్థుల సంఖ్య 80 నుంచి 257 కి పెంచగలిగారు. ఆ తరువాత ఆయన ఖేత్రీ చుట్టుపక్కల గ్రామాలు



సందర్శించి, ఆ గ్రామాల బాలురకోసం ఐదు ప్రాథమిక పాఠశాలలు ప్రారంభించారు.

ఆయన జైపూర్, చితోడ్, ఉదయపూర్, యింకా రాజస్థాన్‌లోని యితర గ్రామా లనేకం సందర్శించారు. పాఠశాలలు ప్రారంభించమనీ, పేదలకు ఆహారం పంచమనీ, కుటీర పరిశ్రమలకు తగు దోహదం చేయమనీ స్థానిక పరిపాలకులను ఆయన కోరేవారు. రాజస్థాన్‌లో కొంతకాలం పనిచేశాక, ఆయన ఆలంబజారు మఠానికి తిరిగివచ్చారు. మరల హిమాలయాలలో తపస్సు చేయాలనే ఆకాంక్ష మనస్సులో కలిగి ఆయన మఠాన్ని వదిలి వెళ్ళారు. కొన్ని తీర్థక్షేత్రాలు దర్శించాక, ఆయన హిమాలయాలకు వెళ్ళవలసి ఉన్నది కాని గురుమహరాజ్ ఇచ్ఛ వేరేగా ఉంది. ఆయన చైతన్య మహాప్రభువు జన్మస్థలమయిన నవద్వీప్ దర్శించాక, ప్రముఖ చారిత్రాత్మక ప్రదేశమయిన ముర్షీదాబాద్ వచ్చారు. ముర్షీదాబాద్ జిల్లాలో భయంకరమైన కరువు తాండవమాడుతోంది. ప్రతిచోటా మరణాలూ, మృతదేహాలూ కనిపించాయి. గ్రామాలలో చిక్కిశల్యమైన ఆవులూ, పశువులకాపర్లూ కనిపించారు. ఆయన హృదయం వారికోసం విలపించినా, చేతిలో చిల్లిగవ్వకూడా లేని సన్యాసి ఏమి చేయగలడు? ఒకరోజు రాత్రి ఆ గ్రామంలో వుండి, మరుసటి రోజు ఉదయం వెళదామని బయలుదేరబోతుండగా, ఒక అశరీరవాణి ఈ విధంగా వినిపించింది: 'ఎక్కడికి వెళ్లుతావు? ఇక్కడే నీవు చేయవలసింది చాలావుంది.' ఈ మాటలు మూడుసార్లు వినిపించాయి. అందుచేత యిక బయలుదేరక, అక్కడే ఉండిపోయారు. అచటి ఆర్తజనులను సేవించటమే గురుదేవుల ఇచ్ఛ కాబోలు!

ప్రతి ఒక్కరూ భగవంతుణ్ణి ఏదో ఒకటి యిమ్మని ప్రార్థిస్తారు. మహాత్ములు మాత్రం తమ మోక్షం గురించి గూడా ప్రార్థించరు. అఖండానందస్వామి తమ స్మృతులలో ఈ విధంగా వ్రాశారు. ''శ్రీరామకృష్ణుల చిత్రపటం ఒకటి ఎప్పుడూ నాతో ఉంచుకునేవాడిని. ప్రతిరోజూ గంగా

స్నానం చేశాక ఆ చిత్రపటం ఎదుట కొన్ని పుష్పాలు సమర్పించి, కరువు పీడిత జనుల శ్రేయస్సు కోసం అశ్రుపూర్ణ నయనాలతో గురుమహరాజ్‌ని ప్రార్థించేవాడిని. రోజూ ఈ విధంగా ఉదయమూ, సాయంత్రమూ ప్రార్థించేవాడిని. ఒకరోజు నా ప్రార్థనకు స్పందన లభించింది. గురు మహరాజ్ ఈ విధంగా చెప్పటం విన్నాను: 'వేచి ఉండు! ఏమి జరుగుతుందో చూడు!' ''

ముర్షీదాబాద్ జిల్లాలోని మహూలా గ్రామంతోపాటు ఆ చుట్టు ప్రక్కలగల చాలా గ్రామాలలో అఖండానందస్వామి మే 15, 1897న కరువుపీడిత జనుల సేవాకార్యక్రమాలు ప్రారంభించారు. రామకృష్ణ మిషనుచే ప్రప్రథమంగా క్రమపద్ధతిన ప్రారంభింపబడిన సేవాకార్యక్రమం యిదే! వివేకానందస్వామి ఈ కార్యక్రమానికి ఆర్థిక సహకారం అందించారు. సేవా కార్యక్రమానికి కావలసిన ధనంతోపాటు, స్వామీజీ మరి యిద్దరు సన్యాసులను గూడా సహాయం చేయటానికి పంపారు. సేవాకార్యక్రమానికై చేసిన అభ్యర్థనను చూసి, మద్రాసు, కలకత్తాల నుంచి అనేక భక్తులు ఈ పవిత్ర కార్యక్రమానికి తమ వంతు ఆర్థిక సహకారం అందించారు.

చాలా మంది ప్రజలు ఈ భయంకర కరువుకాటకంలో అసువులు బాశారు. చిన్నపిల్లలు అనాథలుగా మిగిలిపోయారు. అఖండానందస్వామి వారందరినీ దగ్గరికి చేరతీసి, వారి బాధ్యత వహించారు. వారికోసం ప్రభుత్వ సహాయంతోనూ, స్థానిక వ్యక్తుల సహాయంతోనూ, సర్గాచ్ఛి వద్ద శివనగర్‌లో అనాథాశ్రమం ప్రారంభించారు. ఆ విధంగా చాలా మంది అనాథ బాలురను ఆకలి, నిరక్షరాస్యత, దైన్యం నుండి ఆయన రక్షించారు. ఆ చుట్టుప్రక్కల ఉండేవాళ్ళు స్వామి సేవాభావాన్ని చూసి ఆశ్చర్యపోయేవారు. ఆ బాలుర నందరినీ స్వామి బాలనారాయణులవలె చూసేవారు. ఆ ఆశ్రమం 1912 లో సర్గాచ్ఛికి మార్చబడింది. సర్గాచ్ఛిలో విద్యార్థుల కోసం స్వామి వృత్తిసంబంధమైన పాఠశాల, గ్రంథాలయం, ఉచిత వైద్యాలయాలను స్థాపించారు. ఆ విధంగా సర్గాచ్ఛికే గాక చుట్టుపక్కల గ్రామ ప్రజలకు కూడా ఉపకరించే అనేక కార్యక్రమాలను ఆయన విస్తరించారు. ఆహారము, ఆశ్రయమేగాక శీలనిర్మాణ విద్యపై గూడ ఆయన తన దృష్టిని కేంద్రీకరించారు. అనాథబాలుర మనస్సులలో సేవాభావాన్ని నాటారు. రామాయణ, మహాభారతాల నుండి, యితర శాస్త్ర గ్రంథాల నుండి కథలు చెప్పి, వారి ఆధ్యాత్మిక పురోగమనానికి గూడ తోడ్పడ్డారు.



శివానందస్వామివారి మహాసమాధి తర్వాత 1934లో రామకృష్ణ మఠాధ్యక్షులైనా, అఖండానందస్వామి ఎన్నడూ తన సాధనా ప్రదేశమయిన సర్గాచ్ఛిని వదలి వెళ్లలేదు. ఆర్థిక సంక్షోభం ఎదురయినపుడు ఆయన ఆర్థిక సహకారం కోసం వారణాసిలోని ప్రమదదాస మిత్రకు వ్రాశారు. ప్రమదదాస మిత్ర సహాయం చేయటానికి నిరాకరిస్తూ, సన్యాసులు సాంఘిక సేవలో పాల్గొనేకంటే, పరివ్రాజక జీవితం గడుపుతూ శాస్త్రాధ్యయనం, ధ్యానం, జపాలతో కాలం గడపటం శ్రేయస్కరమని సలహా యిచ్చాడు.

ప్రమదదాస మిత్ర లేఖకు అఖండానందస్వామి యిచ్చిన జవాబు, ఆ విధంగా ఆలోచించే వారందరికీ కనువిప్పు కలిగిస్తుంది. ఆయన ఈ విధంగా సమాధానమిచ్చారు: 'మానవు లందరిలో దైవం వెలసివున్నట్లు నేను దర్శిస్తున్నాను. అందుచేత మానవసేవే మాధవసేవ అని గ్రహించాను. భగవంతుడే స్వయంగా నా చెవులలో ఈ విధంగా గుసగుసలాడుతున్నాడు: 'ఈ మానవులే స్వయానా వేదఋషులు! శ్రీరామ-శ్రీకృష్ణులవలె వీరు అవతారపురుషులు! సర్వస్వము వీరే.' ''

అఖండానందస్వామికి ఆర్తులు, ఆపన్నులు ప్రతి ఒక్కరు దైవ స్వరూపులే! వారి సేవలో ఆయన అమితానందం పొందేవారు.

సర్వ జీవులలో దైవ దర్శనమే వేదానుభూతి యొక్క చరమ లక్ష్యం. ఆ అనుభూతి అఖండానందస్వామికి కలిగింది కాబట్టి, అందరినీ దైవం వలె సేవించారు. ఇక కొద్దిరోజులకు మహాసమాధి చెందుతారనగా, స్వామి

తన జీవిత సిద్ధాంతాన్ని ఒక సన్యాసికి ఈ విధంగా తెలిపారు: ''తన పని చేయటంకోసం గురుదేవులు నన్నింకా ప్రాణంతో నిలిపారు. నిన్ను నీవు యితరులకు అర్పించుకో! అదేవిధంగా ఇతరులందరినీ నీలో యిముడ్చుకో! దానివలన ఎంత ఆనందం కలుగుతుందో నీవే గ్రహించ గలవు. ఆ విధంగా కాక, నీ గురించే నీవు ఎప్పుడూ ఆలోచిస్తూ, తీరికలేకుండా వుంటే, నీకు నీవే బందీవి అవుతావు. చివరికి మరణం నిన్ను కబళిస్తుంది. నిన్ను నీవు ఎంతగా యితరులతో పంచుకుంటే, అంతగా నీకు ఆనందం, శాంతి లభించి, ఆత్మసాక్షాత్కారానికి దారి తీస్తుంది.''

ఆ విధంగా అఖండానందస్వామి జీవితం ద్వారా గురుదేవులు ఆత్మసాక్షాత్కారానికి దారితీసే జీవ-శివయోగాన్ని ప్రదర్శింపజేశారు.

## 5. శరణాగతి యోగం

భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ ఈ విధంగా అంటాడు: ''సర్వ ధర్మాలను పరిత్యజించి నన్నే శరణువేడు. సర్వపాపాల నుండి నిన్ను విముక్తుని చేస్తాను. శోకించకు!''

సందేహాస్పదులు, సందిగ్ధ మనస్కులు ఈ బోధలోని సత్యాన్ని అర్థం చేసుకోలేరు. పాపకృత్యాల నుండి భగవంతుడు మనలను ఏ విధంగా విముక్తులను చేయగలడు? మన కర్మలకు మనమే బాధ్యులం. శాస్త్రాను సారం ప్రారబ్ధకర్మ ఫలాలను మనమే అనుభవించాలి. పైన చెప్పిన మాటలు శ్రీకృష్ణుడు అర్జునుని ప్రోత్సహించటానికే చెప్పివుంటాడు. అది నిజం అవటానికి అవకాశమే లేదు. మేధావు లనబడే వారందరి మనస్సులలో ఈ విధమైన ఆలోచనలు తరచూ తలెత్తుతుంటాయి. ఇదే ప్రశ్నను ఒక భక్తుడు శ్రీరామకృష్ణులను అడిగాడు. ఈ ప్రశ్నకు శ్రీరామ కృష్ణుల సమాధానం సందిగ్ధమనస్కుల సందేహాలన్నిటినీ పటాపంచలు చేస్తుంది. ఆయన ఈ విధంగా అన్నారు: ''చూడు! మేధావులు ఆలోచించే



విధంగా 'ఎవరి కర్మఫలాన్ని వారు అనుభవించాలి' అని నీవు గూడా ఆలోచిస్తున్నావు కదూ! ఆ భావాలన్నీ వదిలివేయి! భగవంతుని శరణు వేడితే, కర్మఫలం నశిస్తుంది. ఆయన సర్వులకూ ప్రభువు. ఆయన ఏదైనా చేయగలడు. శాసనం చేసిన ఆ పరమాత్మ దానిని మార్చగలడు కూడా!''

ఐతే, పరమాత్మ ఒక షరతు విధించాడు. అదేమంటే సర్వ ధర్మాలనూ పరిత్యజించటం. ఇది ఏవిధంగా చేయాలి? శ్రీరామకృష్ణులు మనకు ఈ మార్గాన్ని చూపారు. ఆయన ఈ విధంగా అన్నారు: ''నేను అమ్మను ప్రార్థించాను - 'అమ్మా! యిదిగో నీ పాపం-పుణ్యం - ఈ రెంటినీ నీవే తీసుకో - నాకు అక్కర్లేదు. నాకు నిజమైన భక్తిని యివ్వు. యిదిగో అమ్మా! నీ మంచీ-చెడూ - నాకు మంచీ వద్దు - చెడూ వద్దు - నిజమైన భక్తిని ప్రసాదించు. అమ్మా! యిదిగో నీ ధర్మమూ-అధర్మమూ - నాకు నీ ధర్మమూ వద్దు, అధర్మమూ వద్దు. నిజమైన భక్తినే అనుగ్రహించు తల్లీ!' ''

దీన్లో భావమేమంటే, నేను కర్తను అనే భావాన్ని పూర్తిగా త్యజించాలి. ఆ భావాన్ని నశింపచేయాలి. కానీ సాధారణ మానవులు మంచి పనులకైతే తాము చేశామనే ఖ్యాతి రావాలని కోరుకొంటారు; చెడుపనులకైతే భగవంతుడు చేశాడనే నింద వేస్తూంటారు. అది నిజమైన శరణాగతి కాదు. అది కపటవర్తనం తప్ప వేరేమీ కాదు.

భగవంతుడు కరుణామయుడు. ఆయనకు తన బిడ్డల పట్ల గల ప్రేమ పరిమితులు లేనిది. ఈ నిస్వార్థ ప్రేమ వలన, తన బిడ్డల బాధలను, కష్టాలను నివారించటానికి ఆయన మానవరూపంలో అవతరిస్తాడు. ఆయన అనంతశక్తిమంతుడు; సృష్టికర్త, త్రిలోకాధిపతి, సదానంద, చిదా నంద స్వరూపుడు, సనాతనుడు; అయినా తన ఇచ్ఛానుసారం భువికి దిగివచ్చి, మానవ శరీరానికి సహజమైన బాధలు, కష్టాలు అన్నిటినీ స్వీకరిస్తాడు.

ఈ యుగంలో, భగవంతుడు శ్రీరామకృష్ణ రూపంలో అవతరించాడు. ఓ మానవుడా! ఈ సత్యాన్ని గుర్తెరిగి, ఆయన పాదకమలాల వద్ద సంపూర్ణ శరణాగతిని పొందు. అహంకారాన్ని, కర్తృత్వభావాన్ని, త్యజించి, ఓ ప్రభూ! నేను కాదు నీవే - నేను కాదు - నీవే అని పలుకు! నీవే నా సర్వస్వం - నీవే నా శక్తి - నీవే నా ఆధారం - నీవే నా తల్లి, తండ్రి, స్నేహితుడు, శ్రేయోభిలాషి - అన్నీ నీవే! నేను నీ బిడ్డను - నీ సేవకుడను. నేను నీ భక్తుడను. నీ ఇచ్ఛే జరుగు గాక! ఈ నీ బిడ్డపై నీ కరుణామయ దృష్టి ప్రసరింపజేయి ప్రభూ! ఓ ప్రభూ! ప్రతి ఒక్క విషయానికీ నీపైనే పూర్తిగా ఆధారపడి ఉన్నాను. నాకేది మేలు కలిగిస్తుందో నీకు బాగా తెలుసు. అందుచేత సుఖ, దుఃఖాలలో - ఎల్లప్పుడూ నిన్ను మరువకుండా స్మరించే శక్తిని ప్రసాదించు ప్రభూ! ఇదే భగవంతుని పాదాలవద్ద శరణాగతి పొందదలచిన భక్తుని నిరంతర ప్రార్థన అవాలని శివానందస్వామి అంటారు.

భక్తుడు తన అపక్వ అహంకారాన్ని వదిలి, భగవంతుని సంపూర్ణ శరణాగతి వేడితే, దయామయుడైన పరమాత్మ గీతలో వాగ్దానం చేసిన విధంగా, అటువంటి భక్తుని బరువు బాధ్యతలు పూర్తిగా వహించి అన్ని పాపాలనుండి అతనికి విముక్తి కలిగిస్తాడు.

ఈ శరణాగతి యోగాన్ని ప్రదర్శించటానికి శ్రీరామకృష్ణులు తనతోపాటు శివానందస్వామిని తీసుకువచ్చారు. శివానందస్వామి జీవిత చరిత్ర చదివితే, దానిలో ఎక్కడా ఆయనలో అపక్వ అహంకారం ఉన్నట్లు కనపడదు. ఆయన జీవితంలో ''నేను'' అనే పదానికి తావే లేదు - ఎల్లపుడూ ''నీవు''-''నీవు'' యే! గురుదేవుల పాదాలవద్ద శరణు పొందిన వ్యక్తి సర్వపాప విముక్తు డవుతాడని ఆయన దృఢవిశ్వాసం.

ఒక రోజు ఒక భక్తుడు తన పాపమయ జీవితం గురించి శివానంద స్వామికి చెప్పి, ఎంతో విచారించాడు. స్వామి ఈ విధంగా సమాధాన మిచ్చారు: ''ఈ విషయం గురించి శ్రీరామకృష్ణులు చెప్పిన మాటలు



వినలేదా? ఆయన ఈ విధంగా అనేవారు: 'పాపాలు దూదికొండల వంటివి. చిన్న నిప్పురవ్వ గూడా ఆ కొండలని క్షణంలో దగ్ధంచేసి, బూడిద చేయగలదు. అదే విధంగా దైవానుగ్రహం, లేశమైనాసరే ఎంత పెద్ద పాపాలగుట్టలనైనా నాశనం చేస్తుంది.' భయపడకు! పవిత్రమైన, శక్తిమంతమైన భగవన్నామాన్ని స్మరిస్తూ, హృదయపూర్వకంగా ఆయన్ను ప్రార్థించు. ఇక వేరే ఏమీ అవసరం లేదు.''

మరొక సందర్భంలో, శివానందజీ ఈ విధంగా అన్నారు: 'ఈ యుగంలో, శ్రీరామకృష్ణ నామమే ముక్తి నొసగే మహామంత్రం. అవతార మూర్తులైన శ్రీరాముడు, శ్రీకృష్ణుడు ఒకేసారి కలిసి శ్రీరామకృష్ణులుగా అవతరించారు. రామకృష్ణ నామం స్మరిస్తే, రామ మంత్రం, కృష్ణ మంత్రం జపించిన ఫలితం కలుగుతుంది. పాపులను, దీనులను విముక్తులను చేయటానికే ఆయన అవతరించి, భగవత్సాక్షాత్కారానికి సులభమైన, సుందరమైన మార్గాన్ని చూపారు.' రామకృష్ణ మఠం - రామకృష్ణ మిషనుల అధ్యక్షునిగా, అనేక కార్యక్రమాలలో తీరిక లేకుండా నిమగ్నమయివున్నా, ఆయన ఎన్నడూ తాను ఆ పనులన్నీ చేస్తున్నాననుకోలేదు. తన కార్యక్రమాల వెనుకగల సిద్ధాంతాన్ని ఆయన ఒకసారి ఈ విధంగా వివరించారు: 'గురుదేవులు తన పనిని తాను చేసుకుంటున్నారు. నువ్వు, నేనూ పరికరాలము మాత్రమే! ఆయన మీద మనస్సు నిలుపు. ఏమి చేయాలో అది మీచేత మేము చేయిస్తాము.' అహంకారంతో చేసే పని ఏ ఫలితాలనూ యివ్వదు. అది ప్రపంచానికి ఏమి మేలు చేయగలదు? కఠోర తపస్సు చేసినవానిని, భగవంతుడు తన పనిముట్టుగా చేసికొని, అతని ద్వారా పనిచేస్తాడు. అటువంటివారే సరైన దృక్పథంతో పని చేయగలరు.

స్వయంకృషి ద్వారా స్వంత ప్రయత్నాల ద్వారా, తన శక్తినంతా కోల్పోయిన వారు తప్ప ఇతరులు సంపూర్ణ శరణాగతి స్థితి పొందలేరని శివానందస్వామి చెప్పారు. ఏమీ చేయకుండా, బద్ధకంతో కాలాన్ని వృథా చేస్తూ, తాను భగవంతుని సంపూర్ణ శరణాగతి పొందాననీ, ఆయన

చరణాలను ఆశ్రయించాననీ, ఎవరైనా భావిస్తూంటే, అది ఆత్మద్రోహం, ఆత్మవంచన అవుతుంది.

శివానందస్వామి ఆత్మానుభూతి పొందిన మహానుభావులు. వారి కఠోర తపశ్చర్య, కామకాంచన-త్యాగము, శరణాగతీ ఎంత గొప్పవి అంటే, వివేకానందస్వామి శివానందస్వామిని ''మహాపురుష్'' అని పిలిచేవారు. అందుకనే రామకృష్ణ సంప్రదాయంలో ఆయన ''మహాపురుష్ మహరాజ్''గా పేరు పొందారు. అంత గొప్పవారైనా, ఆయన చాలా వినయంగా ఉండేవారు. ఒకరోజు ఆయన ఈ విధంగా వ్యాఖ్యానించారు: 'గురుదేవులు మంచి నేర్పరియైన క్రీడాకారుడు. ఏమీ చేతగాని ఆటగాళ్ళ బృందంతో గూడా ఆయన ఆటలలో గెలుపొందగలడు. నా దగ్గర ఏముంది? జ్ఞానమూలేదు మేధాశక్తీ లేదు. మంచి వక్తనూకాదు - చూడటానికి బాగానూ ఉండను, ఐనా నాపైన అపారకరుణతో గురుదేవులు నన్ను తన పరికరంగా ఉపయోగించుకుంటున్నారు.'

ఆయన రామకృష్ణ సంస్థల అధ్యక్షులయినా, ప్రారంభంలో భక్తులకు మంత్రదీక్ష ఇవ్వటానికి అంగీకరించలేదు. గురువు అవటం ఆయనకు ఇష్టముండేది కాదు. స్వప్నంలో దివ్యజనని శ్రీశారదాదేవి అనుమతి లభించిన పిదపే ఆయన మంత్రదీక్ష యివ్వటం ప్రారంభించారు. కానీ తనను తాను గురువుగా ఎన్నడూ భావించలేదు. వారణాసిలో ఒకరోజు ఆయన ఒక స్వామితో ఈ విధంగా చెప్పారు: 'గురుదేవులు నా మనస్సు నుండి నేను గురువును అనే భావాన్ని పూర్తిగా తొలగించారు. శివుడే నిజమైన గురువు. ఈ కాలంలో ఆ గురువు శ్రీరామకృష్ణులే! గురుదేవులే భక్తులను ప్రోత్సహించి వారికి ఉత్తేజం కలిగించి, యిక్కడికి వచ్చేటట్లు చేస్తారు. గురుదేవులు నా లోపలి నుండి ఏమి పలికిస్తే, అదే వారికి నేను చెబుతుంటాను. ఆయన నా ఆత్మకు ఆత్మ, నా జీవానికి జీవం.'

శివానందస్వామి చేసే ప్రతి ఒక్కపనిలోనూ ఆయన నిరహంకారం, సంపూర్ణ అంకితభావం, శరణాగతి, ఏకాగ్రభక్తి, గురుదేవుల ఇచ్ఛకే



పూర్తిగా ఒదిగివుండటం చూడగలుగుతాం. ఈ గుణాలే ఆయనను ఉన్నత సత్యానుభూతి పొందేటట్లు చేశాయి.

తన పెంపుడు కుక్క కెలోను చూపిస్తూ ఆయన, 'కెలో నా పెంపుడు కుక్క - నేను గురుదేవుల పెంపుడు కుక్కను' అనేవారు. విశ్వాసపాత్రమైన కుక్కవలె గురుదేవుల భవన ద్వారం వద్ద జీవితాంతం ఉండి, గురుదేవుల పాదాలవద్ద శరణాగతి వేడితే, తప్పనిసరిగా ఆయన పాదాలు లభిస్తాయి. ఈ శరణాగతి యోగాన్ని ప్రదర్శించటానికే గురుదేవులు శివానందస్వామిని తీసుకువచ్చారు.

## 6. చిన్మయ విగ్రహ యోగం

ధార్మిక చరిత్రలో ఎంతోమంది మహాపురుషులు, కవులు, విగ్రహారాధన ద్వారా భగవత్సాక్షాత్కారం పొందటం మనం చూశాం. ప్రతి రోజూ, ప్రపంచమంతటా లక్షలాది జనులు వివిధ దేవాలయాలలో భగవంతుణ్ణి పూజిస్తూంటారు కాని వారిలో మహోన్నత ఆధ్యాత్మిక వ్యక్తులను చాలా అరుదుగా చూడగలుగుతాం. విగ్రహారాధనలో, బాహ్య ఆడంబరాలు, ఆచారాలు ముఖ్యంకాదు, ఆరాధకుని భావనే చాలా ప్రధానం. పూజ చేసేది విగ్రహానికా, చిత్రపటానికా, లేక ఒక చిహ్నానికా అని కాక ఏ విధంగా పూజ చేస్తున్నారన్నదే ప్రధానం. గీతలో శ్రీకృష్ణ పరమాత్మ ఈ విధంగా అంటాడు: 'హృదయంలో అచంచల భక్తితో పత్రం, పుష్పం, ఫలం, నీరు - ఏది సమర్పించినా ఆ పవిత్రాత్ముని సమర్పణను ఆనందంగా స్వీకరిస్తాను.'

మీరాబాయి గూడా ఇదే భావాన్ని తన భజనలో వ్యక్తపరుస్తుంది: ''రాతిని పూజించటంవలన హరి లభిస్తే, నేను పెద్దపెద్ద పర్వతాలనే పూజిస్తాను. హృదయంలో స్వచ్ఛమైన ప్రేమలేనిదే ఎవరూ హరిపాదాలను పొందలేరు.'' తుకారాం, నామదేవ్, ఏక్‌నాథ్, చోకామేళ, గోరాకుంభార్, జనాబాయి వంటి మహారాష్ట్ర భక్తులెందరో విఠలుని భజించి, పూజించి

ఆయన సాయుజ్యం పొందారు. విగ్రహారాధన ద్వారా భగవంతుని పొంద దలచినవారు, వారి హృదయాలలో భగవత్ప్రేమను పెంపొందించుకోవాలి. వారు పూజించే విగ్రహం జడపదార్థంతో చేయబడినదని ఎన్నడూ భావించరాదు. విగ్రహంలో దివ్యచైతన్యశక్తి నిబిడీకృతమై ఉన్నదని ఎల్లపుడూ భావించాలి. పూజ యాంత్రికంగానూ, మొక్కుబడిగానూ కాక, ప్రేమ, భక్తులతో నిండివుండాలి. అపుడే వారు తమ మార్గంలో వెలుగును దర్శించగలరు. ఏ విధమైన బాహ్యసహాయం లేకుండానే శ్రీరామ కృష్ణులు భవతారిణీమాత దర్శనం ఏవిధంగా పొందారో, ఆయన జీవిత చరిత్రలో మనం చూడవచ్చు. ప్రేమ, భక్తి, తీవ్ర ఆవేదనల ద్వారా ఆయన అమ్మ దర్శనమూ, ఆమె పాద సంశ్రయమూ పొందగలిగారు. ఆయన దృష్టిలో జగన్మాత మట్టితోనో, లోహంతోనో రూపొందించబడిన మృణ్మయి కాక శుద్ధచైతన్యం నిండి ఉన్న చిన్మయి.

దైవాన్ని విగ్రహరూపంలో పూజిస్తూ, ఈ చిన్మయ విగ్రహ యోగాన్ని అనుసరించదలచిన సాధకులకు సహాయం చేయటానికి గురు దేవులు తనతో ఒక అద్భుతమైన వ్యక్తి, శశిమహరాజ్ (రామకృష్ణానంద స్వామి)ను తీసుకువచ్చారు.

శ్రీరామకృష్ణులు 1886 ఆగస్టు 16 వ తేదీన భౌతికదేహం చాలించి, మహాసమాధి చెందారు. నరేంద్రుడు, ఇతర సోదర శిష్యులూ కలిసి బారానగరంలో ఒక ఇంటిని అద్దెకు తీసుకొని, అక్కడ తీవ్రసాధనలలో నిమగ్నమయినారు. వారు శ్రీరామకృష్ణుల కోసం ఒక మందిరం ఏర్పరి చారు. గురుదేవుల సేవా బాధ్యతను శశిమహరాజ్ (రామకృష్ణానందస్వామి) తన భుజస్కంధాలపై వేసుకున్నారు. ఆయనకు శ్రీరామకృష్ణుల చిత్ర పటం, పటం కాదు. శ్రీరామకృష్ణులే సజీవంగా ఆ పటంలో ఉన్నారనే భావనే ఆయన కెప్పుడూ ఉండేది. బారానగరు మఠంలో 1886 నుండి 1897 వరకు ఆయన ఆ విధంగా శ్రీరామకృష్ణులను సేవించారు. ఇతర సోదర సన్యాస శిష్యు లందరూ, వివిధ యాత్రాస్థలాలలో తీవ్ర ఆధ్యాత్మిక



సాధనలలోనూ, ధ్యానంలోనూ సమయాన్ని గడిపేవారు కాని శశిమహ రాజ్ మాత్రం గురుసేవ వదలి ఒక్కరోజు గూడా బయటికి వెళ్ళలేదు. ఆయన ఆచరించిన ప్రతి ఒక్క పని పరిపూర్ణ భక్తి, ఏకాగ్రతలతో నిండి ఉండేది. గురుసేవలో ఏ కొద్దిపాటి నిర్లక్ష్యాన్ని గూడా ఆయన సహించ గలిగేవారు కాదు. గురుదేవుల పట్ల ఆయనకుగల పరిపూర్ణ భక్తి, ప్రేమల తీవ్రతను ఈ క్రింది చిన్న సంఘటన తెలియజేస్తుంది.

ఒకరోజు శశిమహరాజ్ మరొక స్వామితో గురుదేవులకు తెల్లవారు జామున పళ్ళు తోముకోవటానికి వీలుగా ఉండేటట్లు, ఆకులు తీసేసి ఒక పలుదోము పుల్ల సిద్ధం చేయమని ఆదేశించారు. పలుదోము పుల్లతో పళ్ళు తోముకోవాలంటే, ఆ పుల్లకి ఒక చివరన మెత్తగా చేయాలని ఆ స్వామికి తెలియదు. ఆయన మొద్దుగా వుండే ఒక పెద్ద కొమ్మని తీసుకు వచ్చారు. గురుదేవులకి ఉపాహారం నివేదించేటప్పుడు శశిమహరాజ్ ఆ కొమ్మని చూశారు. వెంటనే ఆ స్వామిని తీవ్రంగా మందలిస్తూ, ''ధూర్తుడా! ఈ రోజున గురుదేవుల చిగుళ్ళు రక్తం కారేటట్లు చేశావు గదా! చూడు! నీకు సరియైన గుణపాఠం చెబుతాను'' అంటూ ఆయన వైపు దూసుకెళ్ళారు. ఆ స్వామి భయంతో అక్కడి నుంచి పారిపోయారు. వెంటనే పరిస్థితి సద్దుమణిగింది.

గురుదేవులను చిత్రపటంలో ప్రత్యక్షంగా ,అనుభూతి చెందిన యిటువంటి సంఘటనలెన్నో శశిమహరాజ్ జీవితంలో ఉన్నాయి. ఆయన చెన్నైలో వుండగా, గురుదేవులకి ఆయన చేసేపూజ, ఆరతి చూడగలగటం మహద్భాగ్యంగా, మహా ఉత్తేజకరంగా భక్తులు భావించేవారు. ఇవి చూసిన వారందరూ, చిత్రపటంలో శ్రీరామకృష్ణులు ప్రత్యక్షంగా ఉన్నారని విశ్వసింపక తప్పేదికాదు. ఈ క్రింది ఒకటి, రెండు సంఘటనలు దానిని నిరూపిస్తాయి.

ఒకరోజు రాత్రి వాన కురుస్తున్నది. మందిరంలో శ్రీరామకృష్ణుల చిత్రపటంపైన వానధార పడసాగింది. వెంటనే శశిమహరాజ్ అక్కడికి

వెళ్ళి చిత్రపటంపైన గొడుగు తెరిచి, వాన ఆగిపోయేదాకా ఆ రాత్రంగా ఆ గొడుగు పట్టుకొనే వున్నారు. గురుదేవుల చిత్రపటాన్ని పక్కకు మార్చ వచ్చుగానీ ఆ విధంగా చేస్తే గురుదేవులకి నిద్రాభంగం కలుగుతుందని ఆయన ఆ పని చేయలేదు.

వేసవికాలంలో, లెక్కలేనన్ని రాత్రులు ఆయన గురుదేవులకు విసనకర్రవీస్తూ, భయంకరంగా వున్న వేడిమి నుండి బాధ కలగకుండా చేసేవారు.

శశిమహరాజ్‌కి సహాయం చేయటానికి బేలూరు మఠం నుండి బ్రహ్మచారి తేజ్‌నారాయణ్, చెన్నై పంపబడ్డాడు. గురుదేవుల చిత్రపటం చూపిస్తూ, శశిమహరాజ్ తేజ్‌నారాయణ్‌తో ఈ విధంగా అన్నారు: 'చూడు బాబు! ఇది శ్రీరామకృష్ణుల చిత్రపటం మాత్రమేనని అనుకో వద్దు! ఆయన స్వయంగా ఇక్కడ ఉన్నారు. ఆయన సజీవ సమక్షాన్ని ఇక్కడ భావించి, ఆ విధంగా సేవచేయి!'

విగ్రహారాధన వెనుకగల సరియైన భావాన్ని, దృక్పథాన్నీ మానవాళికి ఎఱుకపరిచేటందుకే, గురుదేవులు తనతోపాటు రామకృష్ణానందస్వామి (శశిమహరాజ్)ని తీసుకువచ్చారు.

## 7. నేతి - నేతి యోగం

పురాతనకాలంలో మహర్షులు అంతరవలోకన ద్వారా మానవుని గురించిన మహత్తర సత్యాన్ని కనుగొని, మానవాళి ఎదుట ఆ సత్యాన్ని ఈ విధంగా చాటారు: 'జాజ్వల్యమానంగా ప్రకాశిస్తూ, అంధకారాన్ని పారద్రోలే - ఆ మహాపురుషుని నేను కనుగొన్నాను. ఈ సత్యాన్ని కనుగొన్న వారే మరణపాశముల నుండి తప్పించుకొనగలరు. మరొక మార్గం లేదు.' ఈ విధంగా శ్వేతాశ్వతరోపనిషత్తులో ఒక మహర్షి తెలియజేశారు. శ్రీకృష్ణపరమాత్మ కూడా గీతలో ఈ విధంగా చెబుతాడు:

'ఓ అర్జునా! సర్వభూతాల హృదయాలలో పరమాత్మ ఉన్నాడు.'



'ఓ గుడాకేశా! సమస్త జీవుల హృదయాలలో నివసించే ఆత్మను నేనే!'

ఈ కాలంలో శ్రీరామకృష్ణులు ఈ సత్యాన్ని అతి సుందరంగా, సులభమైన భాషలో, చిన్నచిన్న కథలు, దృష్టాంతాలతో వివరించారు. ఆయన ఈ విధంగా అంటారు: ''ఈ శరీరం దానంతటదే కదులుతున్న దని ప్రజలు అంటుంటారు కానీ భగవంతుడే ఈ శరీరాన్ని కదలిస్తున్నా డని వారికి తెలియదు. ఒక కుండలో అన్నం ఉడుకుతున్నది. బంగాళా దుంపలు, వంకాయలు కూడా కుండలో ఉడుకుతూ, ఎగురుతున్నాయి. అది చూసిన పిల్లలు బంగాళాదుంపలు, వంకాయలు వాటంతటవే ఎగురుతున్నాయని అంటారు కానీ ఆ ఎగిరే వాటి క్రింద మంట (అగ్ని) ఉన్నదని వారికి తెలియదు. అదే విధంగా మానవుడు ఇంద్రియాలు వాటంతటవే పని చేస్తున్నాయని అనుకుంటాడు కానీ తన లోపల పరిపూర్ణ చైతన్యస్వరూపుడైన వాడొకడున్నాడని తెలుసుకోలేడు.

''జ్ఞానియైన వ్యక్తి ఆత్మ, శరీరం - ఈ రెండూ వేరువేరని సరిగ్గా గ్రహించగలుగుతాడు. భగవత్సాక్షాత్కారం పొందాక, ఆత్మ శరీరంతో కలిసివున్నదని భావించడు. కొబ్బరికాయలో పెంకు, కొబ్బరి వేరువేరుగా ఉంటాయి. కొబ్బరినీళ్ళు ఎండిపోయినపుడు కురిడీకాయ ఏ విధంగా గలగలలాడుతూ ఉంటుందో ఆత్మ ఆ విధంగా శరీరంలో ఉంటుంది.''

ఆత్మ స్వభావం, శరీర స్వభావం పరస్పరం వ్యతిరేకంగా ఉంటాయి. శరీరం మార్పుచెందేది, నశించే స్వభావం కలది. అంతేగాక జనన, వార్ధక్య, మరణాది షడ్వికారాలు చెందుతుంది. ఆత్మ ఎల్లప్పుడూ శాంతి, ఆనందాలతో నిండివుంటుంది. అది శాశ్వతమైనది, మార్పు లేనిది. ఆత్మ సనాతనమైనది. దుఃఖాలకు, బాధలకు అతీతమైనది. ఆత్మ సూక్ష్మాతిసూక్ష్మమైనది. అంతేగాక దాని తత్త్వం మనస్సుకు, ఇంద్రి యాలకు గోచరమవదు. అది ఎల్లపుడూ మానవుని హృదయంలోనే వున్నా, ఎవరి చేతనూ తెలుసుకొనబడదు. అది అజ్ఞానం అనే మందపు

పొరతో కప్పబడివుంది. మన మనస్సులో ఆరు శత్రువులున్నారు - వారే కామ, క్రోధ, లోభ, మద, మోహ, మత్సరములు. వీటివలననే ఆత్మ కనపడకుండాపోయి, ఆత్మదృష్టి లోపిస్తున్నది. ఈ మురికి, మాలిన్యము నుండి ఆత్మను పరిశుభ్రము చేసుకున్న తక్షణమే ఆత్మ జాజ్వల్యమానంగా ప్రకాశిస్తుంది. నిరంతర విచక్షణాజ్ఞానంతో పైపైన కప్పబడివున్న శరీరము, మనస్సు, మేధాశక్తి, ఇంద్రియాలు - ఇత్యాది పొరలను తొలగించుకొని, మనస్సును ఆత్మపైనే లగ్నం చేయాలి. చూస్తున్న ప్రతి దానినీ ఇది సత్యమైనది కాదు, ఇది నిత్యమైనది కాదు అని భావిస్తూ, ఇంద్రియాల ద్వారా ఆ అనుభూతిని పొందగలిగితే, ఇక మిగిలేది ఆత్మయే! నిర్వాణషట్కంలో శ్రీ శంకరాచార్యుల వారు ఈ నేతి - నేతి యోగం గురించి చాలా అద్భుతంగా వర్ణించారు:

మనోబుద్ధ్యహంకార చిత్తాని నాహం
నచశ్రోత్ర జిహ్వే న చ ఘ్రాణ నేత్రే!
నచ వ్యోమ భూమిః న తేజో న వాయుః
చిదానందరూపః శివోహం శివోహం.

నేను పురుషుడను కాను, స్త్రీనికాను నపుంసకుడను కాను.
నేను వెలుగులకు వెలుగునైన తేజోస్వరూపుడను.
నేను మానవుణ్ణి కాను, దేవతను కాను, రాక్షసుణ్ణికాను.
నేను బ్రాహ్మణుడనూ కాను, క్షత్రియుడనూ కాను, వైశ్యుడనూ కాను, శూద్రుడనూ కాను.
నేను బ్రహ్మచారినీ కాదు, గృహస్థునూ కాను, వన సంచారియైన సన్యాసినీ కాను.
నేను ఆత్మస్వరూపుడను - అనంత చైతన్య స్వరూపుడను.

ఈ మహత్తర సత్యాన్నే వివేకానందస్వామి 1893లో చికాగోలో జరిగిన విశ్వమత మహాసభలో ప్రకటించారు. ఆయన ఈ విధంగా



ప్రసంగించారు: 'మీరంతా భగవంతుని సంతానం. అనంతానందానికి వారసులు. పవిత్రాత్ములు, పరిపూర్ణులు. ఓ భువిపై ఉన్న దైవ స్వరూపులారా! మిమ్మల్ని పాపులు అనటం మహాపాపం - మానవత్వానికే అది మహాద్రోహం, అవమానం. లేవండి! ఓ సింహాల్లారా! మీరు గొర్రెలనే భ్రాంతి విడనాడండి! మీరు అమృతాత్మస్వరూపులు, ముక్తాత్ములు, ధన్యులు, సనాతనులు. మీరు భౌతిక పదార్థాలుకారు. దేహాలు అంతకంటే కారు. భౌతిక పదార్థాలు మీకు దాస్యం చేస్తాయి. అంతేకాని వాటికి మీరు దాసులు కారు.'

స్వామీజీ ఈ మహోన్నత సత్యాలను భారతదేశంలోనూ, ప్రపంచమంతటా చాటిచెప్పారు. ఐతే ఈ సత్యాలను ప్రపంచానికి ఆచరించి చూపటానికి మాత్రం తురీయానందస్వామిని ఎంచుకున్నారు.

తురీయానందస్వామిని శాన్‌ఫ్రాన్సిస్కోలోని తన విద్యార్థులకు పరిచయం చేస్తూ, వివేకానందస్వామే స్వయంగా ఈ సత్యాన్ని ప్రకటించారు: 'నేను వేదాంతంపై ప్రసంగాలు చేశాను. కానీ యిపుడు మీ ఎదుట వున్న తురీయానందస్వామిలో వేదాంతం మూర్తీభవించి ఉన్నది. తన జీవితంలోని ప్రతిక్షణమూ ఆయన వేదాంతంలోనే జీవిస్తారు. ఆయన ఆదర్శహైందవ సన్యాసి. మీరందరూ పవిత్రంగా, దైవపరంగా జీవితం గడపటానికి ఆయన సహాయం చేస్తారు.'

బాల్యం నుంచీ హరినాథ్ (తురీయానందస్వామి)కు శాస్త్ర గ్రంథ పఠనం అంటే చాలా యిష్టం. ఎన్నో పుస్తకాలు చదివాక, ఆయన మనస్సు చివరికి వేదాంతంపై స్థిరపడింది. వేదాంత సాహిత్య పఠనంలోనే ఆయన చాలా కాలం గడిపారు. జ్ఞానమార్గం ప్రకారం సత్యం గ్రహించాలంటే, మొదట ఆ సత్యాల గురించి చదవాలి లేదా శ్రవణం చేయాలి, ఆ తరువాత వాటి గురించి ఆలోచిస్తూ మననం చేయాలి. చివరిగా నిధిధ్యాసం అనబడే తీవ్ర ధ్యానంలో నిమగ్నమవాలి. హరినాథ్ ఈ సాధనామార్గాన్నే ఎంచుకొని, తన స్వయంకృషి ద్వారానే సత్యాన్ని గ్రహించాలని నిర్ణయించు

కున్నాడు సంపదల ద్వారా సంతతి వలన, కర్మల వలన కాక త్యాగం మూలంగానే ఆత్మను గ్రహించగలమని ఉపనిషత్తులు తెలుపుతున్నాయి. ఇది చదివాక, హరినాథ్ ప్రాపంచిక విషయాల యందు పూర్తి అనాసక్తుడయినాడు. ఆయన ఎంత తీవ్ర వైరాగ్య భావంలో నిమగ్నుడయినాడంటే, స్త్రీల సమక్షాన్ని అసలు సహించగలిగేవాడే కాదు. ఒకరోజు ఆతడు శ్రీరామకృష్ణులతో మాట్లాడుతూ, తన కసలు స్త్రీలంటే యిష్టం లేదనీ, వారి పొడే గిట్టదనీ చెప్పాడు. కానీ గురుదేవులతని భావాన్ని సరిచేస్తూ ఈ విధంగా అన్నారు: 'నువ్వు ఒక మూర్ఖునిలాగా మాట్లాడుతున్నావు. స్త్రీలని కించపరచి తక్కువగా చూడటమా? ఎందుకు? వారు జగన్మాత స్వరూపులు. గౌరవంతో వారికి అభివందనం చేయి. వారి వల నుంచి తప్పించుకోవటానికి అదే ఏకైక మార్గం.' గురుదేవుల ఈ అద్భుత వాక్యాలు స్త్రీలపట్ల హరినాథ్‌కు గల దృక్పథాన్ని మార్చివేశాయి. బాల్యం నుండే అతను నిరంతరం సత్యాసత్య విచక్షణ చేస్తూండేవాడు. చివరికి తన ఆధ్యాత్మిక పోరాటంలో విజయం సాధించి, దేహభావానికి అతీతంగా ఉండగలిగాడు.

అతని జీవితంలోని ఒకటి, రెండు సంఘటనలు సాధనా సమయంలో అతను పడిన ఆరాటాన్ని, సాధన చివరిలో పొందిన ఆత్మ సాక్షాత్కారాన్ని తెలియజేస్తాయి.

ఒకరోజు తెల్లవారుజామున హరినాథ్ గంగానదిలో స్నానం చేస్తుండగా, తన దగ్గరగా ఏదో తేలుతున్నట్లు అనిపించింది. ఒడ్డున వున్న మరికొందరు గూడా దాన్ని చూసి, ''మొసలి, మొసలి, త్వరగా బయటకురా'' అని పెద్దగా కేకలు వేశారు. వెంటనే హరి తీరానికి దూసుకువచ్చాడు కానీ మధ్యలో మోకాలి లోతు నీటిలో ఆగి తనలో తాను ఈ విధంగా అనుకున్నాడు: ''ఏం చేస్తున్నావు? రాత్రింబవళ్ళు 'సోహం, సోహం' అని స్మరిస్తూంటావే? ఇపుడేమో హఠాత్తుగా ఆ ఆదర్శాన్నంతా మరచిపోయి, ఈ శరీరమే నేను అనే భ్రాంతిలో



పడిపోయావే? సిగ్గులేదూ?'' ఈ భావన కలిగిన వెంటనే ఆయన బాగా లోతునీళ్ళలోకి వెనక్కి వెళ్ళి, తన స్నానం కొనసాగించాడు. అదృష్ట వశాత్తూ ఆ మొసలి అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

ఈ నేతి-నేతి యోగ సాధన ద్వారా, ఆయన నిర్భయత్వస్థితిని పొందారు. హిమాలయాలలో పరివ్రాజక జీవితం గడిపేటప్పుడు ఆయనను ఒక అవాంఛనీయ వ్యక్తిగా భావించి, ఒక పోలీసు అధికారి ఆయన్ను అన్నిరకాల యిబ్బందికరమైన ప్రశ్నలూ అడిగాడు. చివరిగా అతను, 'స్వామీ! మీకు పోలీసులంటే భయంలేదా?' అని అడిగాడు. తురీయానందస్వామి వెంటనే ఉద్రేకంగా 'నేను భయపడటమా! మృత్యు దేవత అయిన యమునికే భయపడని నేను పోలీసులకు భయపడతానా?' అన్నారు.

శ్రీరామకృష్ణులు ఈ విధంగా అనేవారు: ''శరీరం, దాని బాధల గురించి దాన్నే జాగ్రత్త వహించనీ! ఓ మనసా! నీవు మాత్రం ఆనందం లోనే మునిగివుండు!'' నిరంతర విచక్షణా, వివేచనలతో తురీయానందస్వామి ఈ స్థితికి చేరుకోగలిగారు. శరీర భావానికి ఆయన పూర్తిగా అతీతులుగా ఉండేవారు. వృద్ధాప్యంలో గూడా ఆయన అనేక శస్త్రచికిత్సలకు లోనయినారు. కానీ వైద్యులు తనకి మత్తుమందివ్వటానికి ఆయన ఎన్నడూ అంగీకరించలేదు. సర్వసాధారణమైన విషయంవలె ఆయన తన మనస్సును శరీరం నుండి వేరుచేసి, శస్త్రచికిత్స జరుగుతున్నంతసేపూ ఎటువంటి బాధనూ వ్యక్తపరచలేదు. ఆత్మానుభూతి పొందినవారు తమను తాము శారీరక స్పృహనుండి వేరు చేసుకోగలరని శాస్త్రాలు చెబుతున్నాయి. ఆ స్థితిలో వారు తమ శరీరాన్ని సాక్షివలె చూసుకోగలరు.

తురీయానందస్వామి అమెరికాలో ఉన్నపుడు, ఒక శిష్యుడు ''స్వామీ! శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచుకోవలసిన బాధ్యత మనపై వుంది కదా'' అని అడిగాడు. స్వామి ఈ విధంగా సమాధానమిచ్చారు: ''ఉంది! కానీ ఉన్నతస్థాయిలో ఈ శరీరమే పెద్దవ్యాధిగా, రోగంగా అనిపిస్తుంది. ఈ

దేహభావానికి అతీతంగా పురోగమించి ఆత్మయే నేను అనే అనుభూతిని పొందాలి. 'నేను ఈ శరీరాన్ని కాను. నేను ఆత్మను. ఈ శరీరం ఒక భ్రాంతియే' అనగల ఉన్నత స్థితిని పొందటానికి అడ్డుగోడగా, ఆటంకంగా నిలిచేది శరీరంపై మనకుగల ప్రేమయే! శరీర భ్రాంతి, శరీరంపై ప్రేమా ఉన్నంత కాలం ఆత్మసాక్షాత్కారం పొందలేం. మరల మరల జన్మించవలసివస్తుంది. కానీ ఆత్మపై గాఢప్రేమ వుంటే, శరీరం పట్ల ఉదాసీన భావం ఏర్పడుతుంది. శరీరంపై వ్యామోహం పూర్తిగా నశించినపుడు మోక్షం త్వరగా లభిస్తుంది.''

'ఆత్మసాక్షాత్కారం పొందటం ఎలా?' అని అడిగిన ప్రశ్నకు ఆయన యిలా సమాధానమిచ్చారు: 'ధ్యానంద్వారా ఆత్మసాక్షాత్కారం పొందవచ్చు. ధ్యానమే సత్యద్వారాన్ని తెరిచే తాళంచెవి. ధ్యానం-ధ్యానం-ధ్యానం - నీ మనస్సులో దివ్యజ్యోతి వెలుగొందేవరకూ ధ్యానం చేయి. అపుడు ఆత్మ దానంతటదే సాక్షాత్కరిస్తుంది. ఉత్తిమాటల వలననో, గ్రంథపఠన వలననో కాక, ధ్యానంవలననే సత్యం గ్రహించబడుతుంది.'

శ్రీరామకృష్ణులు తనతోపాటు తురీయానందులనే ఆధ్యాత్మిక శక్తి జనక యంత్రాన్ని తెచ్చి, ఆత్మను శరీర భ్రాంతి నుండి విడదీసే ప్రక్రియను నేతి-నేతి యోగం ద్వారా ప్రదర్శింపజేశారు.

## 8. శారదా సేవాయోగం

భగవద్గీత ద్వితీయాధ్యాయంలో శ్రీకృష్ణపరమాత్మ స్థితప్రజ్ఞుని లక్షణాలను అద్భుతంగా వర్ణించాడు. ఆ లక్షణాలన్నీ శారదానందస్వామి జీవితంలో పరిపూర్ణంగా ప్రకటితమవుతాయి. రామకృష్ణ సంస్థల కార్యదర్శిగా బాధ్యత వహించటంలోనూ, ఆ బాధ్యతల నిర్వహణలో చూపే సామర్థ్యాన్ని, నేర్పరితనాన్ని, అదేసమయంలో తన మనస్సును సర్వకాల సర్వావస్థలయందు, ప్రశాంతంగా ఉంచుకొనే ఉన్నత ఆధ్యాత్మిక స్థితినీ



గమనించిన వారందరికీ ఆయన మహోన్నత ఉత్తేజం కలిగించి, ఆదర్శవంతంగా నిలిచారు.

రామకృష్ణ సంఘం మొదట్లో చాలా క్లిష్టపరిస్థితులలో ఉండేది. ఒకవైపు బ్రిటిష్ ప్రభుత్వ వ్యతిరేకత, మరొకవైపు ఛాందస హిందువుల నుండి వ్యతిరేకత ఎదురైనవి. ఈ నూతన ఆదర్శాన్ని అంగీకరించటానికి ప్రజలకు చాలా సమయం పట్టింది. పని భారం చాలా ఎక్కువగా ఉండేది కానీ స్వామీజీలు చాలా తక్కువ సంఖ్యలో ఉండేవారు. ఆర్థిక పరిస్థితి గూడా సంతృప్తికరంగా ఉండేది కాదు. అటువంటి విపత్కర పరిస్థితులలో శారదానందస్వామి సంస్థయొక్క భారీ బాధ్యతను తన భుజస్కంధాలపై వేసుకొని, దాదాపు 30 సంవత్సరాల పాటు కృషిచేశారు.

శారదానందస్వామి జీవితంలోని కొన్ని సంఘటనలు ఆయన నిశ్చలమైన మనస్సు గురించి స్పష్టమైన అవగాహన కలగజేస్తాయి:

వివేకానందస్వామి ప్రసంగాలూ, రచనలూ చదివి చాలామంది విప్లవవాదులు ఉత్తేజితులై, రామకృష్ణ సంస్థలో చేరారు. వారిపై నిఘావేసిన పోలీసుల దుశ్చర్యలను ఎదుర్కొనటం శారదానందస్వామికి చాలా కష్టమయ్యేది. ఆ విధంగా మఠంలో చేరిన వారిలో ఆత్మప్రకాశానంద స్వామి ఒకరు. ఇది తెలుసుకున్న పోలీసులు శారదానందస్వామినీ, ఆత్మప్రకాశానందస్వామినీ ప్రశ్నించే నిమిత్తం పోలీసు స్టేషన్‌కి పిలిపించారు. పోలీసు అధికారి శారదానందస్వామిని కుర్చీలో కూర్చోమనికూడ అనలేదు. కనీసం మర్యాదగా కూడా మాట్లాడలేదు. కానీ శారదానందస్వామి అతివినయంగా, మర్యాదగా మాట్లాడుతూ, మఠంలో చేరిన యువకులందరూ రాజకీయ కార్యక్రమాలన్నీ పూర్తిగా వదిలేశారని హామీ యిచ్చారు. మఠానికి తిరిగి వస్తున్నపుడు, ఆత్మప్రకాశానందస్వామి చాలా దుఃఖిస్తూ, 'స్వామీ! నా వలన మీరు మీ పదవికీ, అంతస్తుకు సరిపడని విధంగా యిబ్బంది పడటమేగాక అవమానింపబడ్డారు. నన్ను క్షమించాలి' అన్నాడు. శారదానందస్వామి ఈ విధంగా అతన్ని సమాధానపరిచారు:

'లేదు! లేదు! నన్నెవరు అవమానింపగలరు? నా మనస్సు వారి కాఠిన్యాన్ని అంగీకరించకపోతే వారు నన్నేవిధంగా అవమానించగలరు?' మంచి జరిగితే పొంగిపోక, చెడు జరిగితే కుంగిపోక ఉండే వ్యక్తియే సుస్థిర జ్ఞానం గలవాడనీ, అదే స్థితప్రజ్ఞుని లక్షణమనీ గీతలో శ్రీకృష్ణపరమాత్మ ప్రబోధిస్తాడు.

స్వామి శారదానంద మనస్సు ఎంత నిశ్చలంగా ఉండేదంటే, వివేకానందస్వామి గూడా దానికి అంతరాయం కలిగించలేకపోయేవారు. ఒకసారి స్వామీజీ ఒక పనిమీద శారదానందను కలకత్తా పంపారు. తాను చెప్పిన పని కాలేదని తెలుసుకొని స్వామీజీ ఆయన్ను చాలా తీవ్రంగా మందలించారు. శారదానంద నిశ్చలంగా, ఒక రాతి విగ్రహంలాగా ఉండిపోయారు. కొద్ది సేపటి తర్వాత టీ యివ్వబడింది. అంతకు ముందు అసలేమీ జరగనట్లు ఆయన టీ తాగసాగారు. స్వామీజీ, 'శారదానందస్వామి నరాలు చేప రక్తంతో నింపబడివున్నాయి. అవెప్పుడూ వేడెక్కవు' అని వ్యాఖ్యానించారు.

క్రోధానికి బహుదూరంగా వుండే శారదానందస్వామిని, వివేకానందస్వామి అపుడపుడూ: 'నీ నరాలు కప్ప కాళ్ళు చేతుల వంటివి లేదా బురద చేప రక్తాన్ని కలిగివుంటాయి. అందుకే అంత మెత్తగా, సాత్త్వికంగా ఉన్నావు' అని ఎగతాళి చేసేవారు. తాబేలు తన కాళ్ళని ఏవిధంగా బయటి నుంచి లోపలికి ముడుచుకుంటుందో, ఆ విధంగా జ్ఞాని విషయ వస్తువుల నుండి ఇంద్రియాలను పూర్తిగా వెనుకకు మరలుస్తాడని భగవద్గీతలో చెప్పబడివుంది. దీనికి చక్కటి ఉదాహరణ శారదానందస్వామి. తన ఇంద్రియాలపై ఆయనకు పూర్తి ఆధిపత్యం ఉండేది.

ఆయన ఉద్బోధన్ గృహంలో వుండే రోజులవి. క్రింది అంతస్తులో ఒక చిన్నగదిలో శారదానందస్వామి తన పనిచేసుకొనేవారు. ఈ గదిలో కూర్చొనే ఆయన శ్రీరామకృష్ణ జీవిత చరిత్రను ''శ్రీరామకృష్ణ లీలా ప్రసంగము'' (Sri Ramakrishna–The Great Master) పేరిట



గ్రంథ రచన చేశారు. సంస్థాపరమైన అన్నిరకాల గందరగోళాల మధ్యా ఆయన యింతటి మహోన్నత ఆధ్యాత్మిక గ్రంథాన్ని ఏ విధంగా రచించ గలిగారు? శ్రీశారదామాత పై అంతస్తులో ఉండేవారు. ఆమెను దర్శించటానికి చాలామంది భక్తులు నిరంతర ప్రవాహంగా వస్తూండేవారు. సంస్థాగత విషయాలపై చర్చించటానికి వచ్చేవాళ్ళు, స్వామీజీల, భక్తుల వ్యక్తిగత సమస్యలు, మాతృశ్రీ వ్యక్తిగత సదుపాయాలు ఏర్పరచటం, వీటన్నిటికీ మించి పెద్దపెద్ద శబ్దాలు - యిటువంటి గందరగోళ వాతావరణంలో అంతటి మహత్తర గ్రంథరచన ఆయన ఏవిధంగా పూర్తి చేశారో గదా! సాధారణ మానవులకిది అసాధ్యమైన విషయం అంటే అతిశయోక్తి కాదు. మరొక చిన్న సంఘటన - ఒకరోజు శారదానందస్వామి గది ప్రక్కనే గల ఆఫీసు గదిలో కొంతమంది యువసన్యాసులు పెద్దగా మాట్లాడుకుంటున్నారు. మాతృశ్రీ పరిచారిక అయిన గోలాప్‌మా వారందరినీ మందలించింది. బిగ్గరగా అరుస్తున్న గోలాప్‌మా మాటలు విని స్వామి ఆమెతో, ''గోలాప్‌మా! ఇకచాలు! దయచేసి వారి మాటలు నీవు వినవద్దు. నా చెవులని నేను 'అనవసరమైన మాటలు వినవద్దు' అని వారించాను. అందుచేత నా చెవులకి అవేమీ వినపడవు'' అన్నారు. ఆయన ఇంద్రియ నిగ్రహం అంత గొప్పది.

అటువంటి ఉన్నత మానసిక స్థితిని ఆయన ఏ విధంగా పొందగలిగారు? శ్రీశారదామాతపై అంకిత సేవాభావం, అచంచల దృఢభక్తి వలననే అది సాధ్యమైంది. మాతృశ్రీకి శారదానందస్వామిని పరిచయం చేసింది యోగానందస్వామి! ఒకసారి శారదానందస్వామి యోగానందస్వామితో ఈ విధంగా అన్నారు: ''సోదరా! స్వామీజీని అర్థం చేసుకోవటం చాలా కష్టంగావుంది. ఆయన రకరకాలుగా మాట్లాడుతుంటారు. ఆయన ఏ విషయాన్ని గురించి మాట్లాడినా, ఎంత శక్తిమంతంగా ఉంటుందంటే ఆయన ఎదుట మాట్లాడేవారు ఎందుకూ పనికిరాని వారిగా, ఏమీ తెలియని వారిగా అయిపోయారు.'' యోగానందస్వామి ఈ విధంగా

సలహాయిచ్చారు: ''శరత్! ఒక విషయం చెబుతాను విను! అమ్మ పాదాలు గట్టిగా పట్టుకో! ఆమె చెప్పినదేదైనా సరైనదే!'' ఆ తరువాత యోగానంద, శారదామాత వద్దకు శారదానందను తీసికెళ్ళారు. శారదామాత గ్రామీణ అనూయకత్వం వెనుక దాగివున్న అసాధారణ ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని శారదానందస్వామి కనుగొని, ఆమె పాదాల వద్ద సంపూర్ణ శరణాగతి పొందారు. మాతృశ్రీ భౌతికదేహం చాలించేటంతవరకూ నిరంతరాయంగా 21 సంవత్సరాలు ఆయన గొప్ప భక్తిశ్రద్ధలతో, అంకిత భావంతో శారదామాత సేవచేసి - శారదామాత సేవలో ఆనందం పొందే శారదానందగా సార్థక నామధేయుడైనారు. అమ్మకు ఏవిధంగా సౌకర్యం, సంతోషం కలిగించాలి అనేదే ఆయన ప్రధాన ధ్యేయంగా ఉండేది.

శ్రీమాత దయవలన ఆమె విశ్వజనని అనీ, యుగావతారులైన శ్రీరామకృష్ణుల సహధర్మిణిగా మానవాళి శ్రేయస్సుకోసం అవతరించిన దివ్యజనని అనీ ఆయన గ్రహించారు. ఒకసారి ఒక భక్తుడు శారదానందస్వామితో మాట్లాడుతూ, తాను అతిసులభంగా శ్రీరామకృష్ణుల దివ్యతత్త్వాన్ని అర్థంచేసుకోగలననీ, కనీసం ఆ నమ్మకమైనా కలిగి వుంటాననీ, కానీ అమ్మ విషయంలో అది తారుమారవుతున్నదనీ, ఆమె దివ్యత్వాన్ని అర్థంచేసుకోలేక పోతున్నాననీ అన్నాడు. స్వామి సమాధానమిస్తూ, ''ఈ యుగంలో పేడ ఎత్తుకొని జీవనం గడిపే ఒక స్త్రీని, ఒక గ్రామీణస్త్రీ కుమార్తెను భగవంతుడు వివాహమాడారంటావా ఏమిటి? అంతమాత్రం ఆమె గొప్పతనాన్ని అర్థంచేసుకోలేవా?'' అన్నారు.

శారదామాత ఔన్నత్యాన్ని మొదట్లో చాల కొద్దిమందే గ్రహించగలిగారు. ఈ విషయంలో, వివేకానందస్వామియే ప్రజలకు కనువిప్పు కలిగించారు. తన సోదర శిష్యులకు వ్రాసిన ఒక లేఖలో ఆయన ఈ విధంగా వ్రాశారు: ''నావరకు నాకు, తండ్రి కరుణకంటే తల్లి కరుణ లక్షలాది రెట్లు విలువైనది. అమ్మ కరుణ, అమ్మ ఆశీస్సులు నాకు ఎంతో ముఖ్యమైనవి. రామకృష్ణులు అవతార పురుషులనీ, చాలా గొప్పవారనీ,



ఇంకా ఏమేమో మీరు చెప్పవచ్చు కానీ సోదరా! అమ్మపై భక్తిలేని వారిని మాత్రం నేను నిరసిస్తాను. వారు నాకు నచ్చరు.''

శారదామాత నిజతత్త్వాన్ని తెలుసుకొన్న కొద్దిమందిలో శారదానందస్వామి ముఖ్యులు. ఆయన ఆమెను అత్యంత ప్రేమ, భక్తి, శ్రద్ధలతో సేవించారు. ఆయన సేవలతో శారదామాత ఎంతో ప్రీతి చెందేది. మెచ్చుకోలుగా ఆవిడ ఈ విధంగా అనేవారు: 'నా బరువు బాధ్యతలు శరత్‌లాగా స్వీకరించగలిగిన వారు మరొకరు లేరు. అతను నా వాసుకి. తన వేయి పడగలను విస్తరింపచేసి నాకు ఎంత సేవచేస్తున్నాడు! చిన్న వానజల్లు పడితే, నేను తడవకుండా వెంటనే తన గొడుగు పడతాడు!'

దివ్యజనని కరుణ వలన శారదానందస్వామి సర్వజీవులలో గల జగన్మాత సమక్షాన్ని గ్రహించగలిగి, చివరికి మానవజీవిత లక్ష్యమైన అనేకత్వంలో ఏకత్వాన్ని గ్రహించగలిగారు. శారదామాతను అంకిత భావంతో, భక్తితో సేవించి ''శారదా సేవాయోగాన్ని'' అభ్యసించిన వారు ఆమె అనుగ్రహం పొంది దివ్యజ్యోతిర్లోకాలను చేరుకోగలరని శారదానందస్వామి ద్వారా శ్రీరామకృష్ణులు ప్రపంచానికి చూపించారు. ఆమె సంతోషిస్తే, మోక్షద్వారాన్ని తెరువగలదు.

## 9. విషాద యోగం

సాధారణంగా ఈ ప్రపంచంలో మూడు రకాల మనుష్యులుంటారు. మొదటిరకం మేధావులు లేక తెలివైనవారు, రెండవరకం మధ్యస్థులు, మూడవరకం మూర్ఖులు లేక తెలివితక్కువవారు.

మొదటిరకం వారు ఈ ప్రపంచాన్ని జాగ్రత్తగా గమనించి, పాఠాలు నేర్చుకుంటారు. వారు తమ మనస్సును, నేత్రాలను తెరచివుంచి, ప్రతి విషయాన్నీ కూలంకషంగా గమనిస్తారు. తమ చుట్టూ జరుగుతున్న ప్రతివిషయాన్నీ, తమ సునిశిత మేధాశక్తి ద్వారా పరిశీలించి, తీవ్ర ఆలోచన, అంతరవలోకనద్వారా తమకు ఏది శ్రేయస్సు కలిగిస్తుందో,

దాన్నే ఎంచుకుంటారు. ఉదాహరణకి - బుద్ధభగవానుడు ఒక కుష్ఠువ్యాధి గ్రస్తుడినీ, ఒక వృద్ధుడినీ, ఒక శవాన్నీ చూశాడు. వాటి గురించిన తీవ్ర ఆలోచనద్వారా, ఈ ప్రపంచంలో ప్రతిజీవీ నశించవలసినదేననీ, అందు వలన జీవితం శాశ్వతం కాదనీ నిశ్చయించుకొని, శాశ్వతమైన సత్యాన్వేషణకై రాజ్యసుఖాలనూ, భోగాలనూ వదలుకున్నాడు.

రెండవ తరగతి జనులు, మొదట్లో తాము చాలా సంతోషంగా ఉన్నామనీ, యితరులకు జరుగుతున్న విషయాల గురించి తాము ఆందోళన చెందనవసరంలేదనీ అనుకుంటారు. వాళ్ళు చాలా సంతోషంగా, స్థిరంగా, హాయిగా ఉన్నామనుకుంటారు. హఠాత్తుగా ఒకరోజు, అనుకోకుండా పెద్దకష్టం లేదా ప్రమాదం సంభవించి, వారు అపాయంలో పడిపోయినట్లు గమనించగలుగుతారు. వారికి జీవితంలో పాఠాలు నేర్చుకోవటానికి పెద్ద దెబ్బలు, అనుభవాలు అవసరమవుతాయి. అటువంటిది సంభవించినపుడే వారు సరైన దారికి వస్తారు. తాము ముందర అనుకున్నట్లు అంతా బాగా లేదనీ, సజావుగా లేదనీ అప్పుడు గ్రహించగలుగుతారు. వారు జీవిత సత్యాలను ఎదుర్కోవాలి. అటువంటి సున్నిత మనస్కులు రెండవ రకానికి చెందినవారు. వారు తమ జీవితంలోని చేదు అనుభవాల ద్వారా పాఠాలు నేర్చుకొని, తమ జీవన విధానాన్ని మార్చుకుంటారు. అంత రవలోకన ద్వారా క్రమక్రమంగా, వా రీ ప్రపంచపు పోకడలను అర్థం చేసుకొని, తమ మనస్సును శాశ్వత సత్యంవైపుకు మరలిస్తారు. అపుడిక వారు ఈ ప్రాపంచికాగ్నిలో తమ చేతులను మరల మరల కాల్చుకోవాలని అనుకోరు.

మూడవ రకం వ్యక్తులు, ఈ ప్రపంచం నుంచి కోలుకోలేని దెబ్బలు తింటారు, రాత్రింబవళ్ళూ బాధపడతారు, కానీ మరుక్షణమే తమకు జరిగినదంతా మరచిపోయి, దాని గురించి ఏవిధమైన ఆలోచనా చేయరు. వారి మనస్సులు చాలా స్థూలంగా ఉంటాయి గనుక ఈ భోగ, ఇంద్రియ ప్రపంచం గురించి తప్ప మిగతా దేని గురించీ, ఆలోచించనే ఆలోచించరు.



వారి జీవన విధానాన్ని అసలు మార్చుకోరు. అటువంటి వారిని శ్రీరామకృష్ణులు, ముళ్ళ మొక్కల్ని తింటూ నోటినుంచి రక్తం కారుతున్నా, ఆ రక్తం మొక్కల నుంచే వస్తున్నదనుకొని యింకా వాటినే తింటున్న ఒంటెలతో పోలుస్తారు. వారిలో సున్నితతత్వం మటుమాయమైపోతుంది. వారు ఆధ్యాత్మిక జీవితంలో ఎటువంటి పురోభివృద్ధీ సాధించలేరు. అటువంటి వారిని శ్రీరామకృష్ణులు - బద్ధజీవులు అని పిలుస్తారు.

చాలా కొద్దిమంది మాత్రమే బుద్ధుని మార్గాన్ని అనుసరిస్తారు. కానీ ఎక్కువ మంది వారి జీవిత అనుభవాలనుంచే పాఠాలు నేర్చుకుంటుంటారు. తమ జీవితంలో ఎదురయ్యే చేదు అనుభవాల ద్వారానే వారు తెలివి పొందుతారు. మన మనస్సులను తనవైపు మరల్చటానికే భగవంతుడు కష్టాలు, దుఃఖాలు ప్రసాదిస్తాడు. తన ఆత్మీయుల మరణం, వ్యాధి, సన్నిహితుల నుండి విడిపోవటం, నిరాశ, విసుగు, పేదరికం, నిస్సహాయత, విషాదం, దుఃఖాలు, దురదృష్ట క్షణాలు జీవితంలో ఎదురైనపుడు వారు ప్రాపంచిక జీవితం యందు అభిరుచి కోల్పోతారు. ఆ విషాద సమయంలోనే ఆసరా కొరకు వారు తమ మనస్సును దైవంవైపు మరలుస్తారు. విషాదమే మనస్సును దైవంపై ఏకాగ్రం చేసేటట్లు దోహద పడుతుంది కాబట్టి అపుడది విషాదయోగ మవుతుంది. అద్వైతానంద స్వామి (గోపాల్) విషాదయోగం అభ్యసించిన ఒక మహావ్యక్తి. భార్య మరణంతో భరించలేని దుఃఖం అలముకొనగా హృదయం ముక్కలు చెక్కలయి, ఓదార్పు, శాంతి కోసం ఆయన తన 55వ ఏట శ్రీరామకృష్ణుల వద్దకు వచ్చారు.

ప్రథమ సందర్శనంలో గురుదేవులు గోపాల్‌ని అసలు పట్టించుకోలేదు. ఒక అపరిచిత వ్యక్తిలాగానే చూశారు. ఆయన గోపాల్‌కి గల వైరాగ్య భావాన్ని పరీక్షిద్దామనుకున్నారు. చాలామంది విషయంలో, వైరాగ్యం ఎక్కువకాలం నిలవదు. ఆ తాత్కాలిక వైరాగ్యాన్నే శ్మశాన వైరాగ్యమనీ, మర్కట వైరాగ్యమనీ అంటారు. కొంతకాలం అయిన తరువాత తమకు

తగిలిన దెబ్బలు మరచిపోయి ఇదివరకు తాము గడిపిన మామూలు జీవితంలోనికే మరల ప్రవేశిస్తారు. గోపాల్ రెండవసారి గురుదేవులను సందర్శించిన తరువాతనే గురుదేవులు ఆయన నిజాయితీని మనఃపూర్వక వైరాగ్యాన్నీ గుర్తించి, అవి నిజమైనవని అంగీకరించారు. ఈసారి, మంచి వైద్యునిలాగా, ఆయన గోపాల్ దుఃఖానికి తగిన శక్తిమంతమైన మందును యిచ్చారు. ఈ ప్రపంచపు నశ్వరత్వాన్ని గురించి గురుదేవులు పలికిన పలుకులు గోపాల్ మనస్సును ఆకర్షించి చెరగని ముద్రను వేశాయి. ఆ మాటలు వినటంతో సరిపెట్టుకోక వాటి గురించి గోపాల్ చాలా తీవ్రంగా, లోతుగా ఆలోచించి, చివరికి ఈ ప్రపంచాన్ని త్యజించి, శ్రీరామకృష్ణుల పాదాలవద్ద ఆశ్రయం పొందాడు. దయామయులైన శ్రీరామకృష్ణులు, తనకన్న ఎనిమిదేళ్ళ పెద్దవాడైన గోపాల్‌ని తన శిష్యునిగా అంగీకరించారు.

గురుదేవులను గోపాల్ ఒక విధేయురాలైన నర్సువలె సేవించాడు. గురుదేవులు కాన్సర్‌తో బాధపడుతున్నపుడు, ఆయనకు మందులివ్వటం, ఆహారం సమయానికి ఏర్పరచటం, చివరికి ఆయన కంఠవ్రణాన్ని కడిగి శుభ్రం చేయటం గూడా గోపాల్ తన విధిగా నెరవేర్చేవాడు. గురుదేవులు గోపాల్‌ను మాతృశ్రీ శారదాదేవికి పరిచయం చేశారు. గోపాల్ గురుదేవులనీ, శారదామాతనూ ఎంతో భక్తి, శ్రద్ధలతో సేవించాడు. వారి దయవలన సర్వజీవులలో గల గురుదేవుల సమక్షాన్ని అద్వైతానంద గుర్తించగలిగి, తన అనుభవాన్ని యీ విధంగా తెలిపారు: 'తానే అన్నిటా ఉన్నానన్న నిజాన్ని గురుదేవులు నాకు చూపారు. అటువంటప్పుడు ఎవరిని నిందించగలను? ఎవరిని విమర్శించగలను?'

గోపాల్ విషాదమే ఆయన్ను గురుదేవుల వద్దకుతెచ్చి, ఈ ప్రాపంచిక దుఃఖాల, బాధలనుండి విముక్తి కలగజేసి, అతనిపై అమిత ఆనందాన్ని, శాంతిని ప్రసరింపజేసింది.

వయోవృద్ధులైనవారికీ, ప్రాపంచిక ఆర్తులకూ సరైన మార్గం చూపి, ఆదర్శవంతంగా జీవితం గడిపి, ముక్తి పొందే విధానంలో ఒక చక్కటి



ఉపమానంగా ఉండటం కోసమే శ్రీరామకృష్ణులు తనతోపాటు అద్వైతానందస్వామిని తీసుకువచ్చారు.

## 10. జప యోగం

అనాదికాలం నుండి లక్షలాది భక్తులు పవిత్ర భగవన్నామ స్మరణతో సంసార సాగరాన్ని సులభంగా దాటారు. మహర్షులు, యోగులు, ప్రవక్తలు, అవతారపురుషులు, వేదపురాణాలు - అన్నీ ముక్తకంఠంతో జపయోగ ప్రాశస్త్యాన్ని వేనోళ్ళ చాటి చెప్పాయి. అధఃపతితులను, పాపాత్ములను గూడ దివ్యజ్ఞానంతో ప్రకాశింపజేసి, తరింపజేసేటంతటి శక్తిమంతమైనది భగవన్నామం. బందిపోటు దొంగ రత్నాకరుడు రామనామ స్మరణచే వాల్మీకి మహర్షిగా పరివర్తన చెందిన సంఘటన మన ఇతిహాసంలో సుప్రసిద్ధమైనది.

సాధకుడు భక్తిశ్రద్ధలతో, ఏకాగ్రతతో జపసాధన చేసినపుడు తన హృదయాంతరాళాలలో అనంత ఆనందాన్ని పొందగలుగుతాడు. తనలో తాను పొందే ఆ వర్ణనాతీత ఆనందం - జపానందం - అతని మనస్సులో నూతన ఆశలను రేకెత్తించి, జపసాధన మరింత తీవ్రంగా చేయాలని ఆకాంక్షించేటట్లు చేస్తుంది. కథామృత గ్రంథంలో శ్రీరామకృష్ణులు, దాదాపు ప్రతిపుటలోనూ భగవన్నామ శక్తిని ప్రశంసిస్తారు. ఒక సందర్భంలో ఆయన ఈ విధంగా చెప్పారు: 'భగవన్నామాన్ని ఏకాంతంలో, మౌనంగా స్మరించటమే జపం. ఏకాగ్రమైన మనస్సుతో ఆయన నామాన్ని స్మరిస్తే, భగవంతుని రూపాన్ని దర్శించి, సాక్షాత్కరించుకోగలం. గంగానది నీటిలో ఉన్న ఒక పెద్దచెక్క, ఒడ్డునవున్న కొయ్యముక్కకు గొలుసుతో కట్టివేయబడివున్నదనుకో! నీటిలో దిగి, ఆ గొలుసును పట్టుకొని ఒక్కొక్క గొలుసును దాటుతూ వుంటే చివరికి ఆ చెక్కను చేరుకోగలవు. అదేవిధంగా భగవన్నామ స్మరణతో భగవంతునిలో ఐక్యమై, చివరికి ఆయనను చేరుకోగలవు.'

శ్రీశారదామాత ప్రతిరోజూ దాదాపు లక్షజపం చేసేవారు. కోల్‌పారాలో ఒక శిష్యుడు అమ్మతో తన సందేహాన్ని వ్యక్తపరుస్తూ, 'అమ్మా! మనస్సు ఎంతో అలజడిగా ఉంటున్నది. ఏ విధంగానూ దాన్ని స్థిరంగా ఉంచలేకపోతున్నాను' అన్నాడు. సమాధానంగా అమ్మ ఈ విధంగా అన్నారు: ''గాలి మబ్బులను చెదరగొట్టినట్లు, భగవన్నామం ఈ ప్రాపంచిక మబ్బులను చెదరగొడుతుంది. రోజుకి 15-20 వేల సార్లు భగవన్నామ స్మరణ చేస్తే మనస్సు ఏకాగ్రమై, నిశ్చలమవుతుంది. ఇది నిజం. కృష్ణలాల్! ఇది నాకు స్వయంగా అనుభవంలోవున్న విషయం. మొదట సాధనచేసి, ఫలితం రాకపోతే అప్పుడు ఫిర్యాదు చేయండి. జపం చేసేటపుడు కొంచెమైనా భక్తితో చేయాలి. కానీ ఆ విధంగా ఎవరూ చేయరు. వారేమీ చేయరు. కానీ 'నేను ఎందుకు విజయం సాధించలేకపోతున్నాను?' అని ఫిర్యాదు మాత్రం చేస్తారు.''

బ్రహ్మానందస్వామి గూడ జపానికి చాలా ప్రాధాన్యత నిచ్చారు. ఆయన ఈ విధంగా చెప్పారు: 'జపం-జపం-జపం! పనిచేస్తున్నప్పుడు గూడ జపం చేయండి. మీ కార్యక్రమాలన్నిటి మధ్యా భగవన్నామ స్మరణ జరుగుతూనే ఉండనివ్వండి. ఇది గనక చేయగలిగితే, మీ హృదయ వేదనంతా తగ్గిపోతుంది. భగవన్నామాన్ని శరణువేడి అనేకమంది పాపాత్ములు పుణ్యాత్ములయి, మోక్షాన్ని పొందారు. భగవంతునిపై, ఆయన నామంపై అఖండ విశ్వాసాన్ని కలిగివుండండి. అవి రెండూ వేరువేరు కాదని నిశ్చయంగా తెలుసుకోండి.'

శ్రీకృష్ణపరమాత్మ గూడ భగవద్గీతలో 'యజ్ఞాలలో నేను జపయజ్ఞాన్ని' అని చెబుతాడు. జ్ఞానులైన మహానుభావుల ఈ వాక్యాలు భగవన్నామ మహాత్మ్యాన్ని, మహాశక్తిని మనకు తెలియజేస్తాయి.

భగవన్నామ శక్తిని ప్రదర్శింప జేయటానికి శ్రీరామకృష్ణులు తనతోపాటు యోగానందస్వామిని తీసుకువచ్చారు.



తన పాఠశాల విద్య చివరి సంవత్సరంలో యోగీన్ (యోగానంద స్వామి) శ్రీరామకృష్ణులను కలుసుకున్నాడు. ప్రథమ సందర్శనంలోనే గురుదేవులతని మనస్సుపై చెరగని ముద్రను వేసి, మళ్ళీరమ్మని చెప్పారు. యోగీన్ శ్రీరామకృష్ణులను తరచూ సందర్శించటం ప్రారంభించాడు. శ్రీరామకృష్ణుల సాన్నిహిత్యం యోగీన్ ఆలోచనా విధానంలో గొప్ప మార్పును తెచ్చింది. భగవత్సాక్షాత్కారమే అతడి ఏకైక జీవిత లక్ష్యమయింది. కామినీకాంచన పరిత్యాగం వలననే దైవసాక్షాత్కారం సాధ్యమవుతుందని అతను గురుదేవుల ద్వారా తెలుసుకున్నాడు. కామాన్ని జయించి, దైవసాక్షాత్కారం పొందటం ఎలా అన్నదే అతని ఏకైక ధ్యేయమయింది. ఒకరోజు ఆతడు గురుదేవుల నీ ప్రశ్న అడిగాడు: 'కామాన్ని జయించటం నాకు నేర్పగలరా?' గురుదేవులు, 'హరినామస్మరణ చేయి కామం దానంతటదే పారిపోతుంది' అని సమాధాన మిచ్చారు. అంత సులభమైన పరిష్కారం తన సమస్యను తీర్చగలదా? అన్న సందేహం యోగీన్‌కు కలిగింది. గురుదేవులకు దాన్ని గురించి సరిగ్గా తెలియదనీ, అందుకనే ఏదో ఒక పనికిరాని విధానం తనకు చెప్పారనీ యోగీన్ అనుకున్నాడు. అంతేగాక, 'చాలామంది హరినామస్మరణ చేస్తూనే వున్నారు. వారిలో కామం అదృశ్యమవటంలేదే?' అని గూడా అనుకున్నాడు. పంచవటి వద్ద నారాయణ్ అనే హఠయోగి కూర్చొని ఉండటం యోగీన్ చూశాడు. ప్రాణాయామం, ఆసనాలు వేయటం ఇటువంటి ప్రక్రియల ద్వారా శరీరం, మనస్సు, ఇంద్రియాలను నిగ్రహించటం నేర్పి చాలామంది ప్రజలను ఆ యోగి ఆకర్షించాడు. అవన్నీ నేర్చుకోకుండా కామజయం సాధ్యం కాదనీ, భగవత్సాక్షాత్కారం పొందలేననీ యోగీన్ ఆ ప్రక్రియలన్నీ నేర్చుకుందామని అనుకున్నాడు. అందుచేత, గురుదేవులకు తెలియజేయకుండా అతను తిన్నగా ఆ హఠయోగి వద్దకు వెళ్ళాడు. ఆ హఠయోగి చెప్పేవన్నీ అమితశ్రద్ధతో వింటున్నప్పుడు అనుకోకుండా హఠాత్తుగా గురుదేవు లక్కడికి వచ్చి, యోగీన్ చేయిపట్టుకొని, తనతో

పాటు ఎమ్మన్నారు. వారిద్దరూ గురుదేవుల గదివైపు వెళుతుండగా, గురుదేవు లీవిధంగా అతనిని మందలించారు: ''నువ్వు అక్కడి కెందు కెళ్ళావు? వెళ్ళవద్దు! ఆ హఠయోగి ప్రక్రియలు నేర్చుకోవటం వలన నీ మనస్సు శరీరానికే పరిమితమయిపోతుంది. వాటి వలన దైవం యందు ఆర్తి కలగదు.''

యోగీన్ శ్రీరామకృష్ణులను మరల సందేహించాడు. తన నుంచి దూరంగా పారిపోకుండా ఉండేటందుకే గురుదేవులు ఆ హఠయోగిని సందర్శించవద్దని నిరుత్సాహపరుస్తున్నారని అతను అనుకున్నాడు. అయినా, మళ్ళీ ఈ విధంగా అనుకున్నాడు: 'గురుదేవులు చెప్పిన విధంగా నేను ఎందుకు చేసి చూడకూడదు? ఆ విధంగా చేసి, ఏమవుతుందో చూస్తాను?' ఆ తరువాత యోగీన్ తన అనుభవాన్ని ఈ విధంగా తెలియ జేశాడు: 'ఈ విధంగా అనుకొని, ఏకాగ్రమైన మనస్సుతో హరినామస్మరణ చేశాను. కొద్దిరోజులకే, గురుదేవులు తెలిపిన ఫలితం నా అనుభవానికి రాసాగింది.'

హరినామ స్మరణతో, తన మనస్సు నుండి యోగీన్ కామాన్ని పరిపూర్ణంగా నాశనం చేయగలిగాడు. ఆ తరువాత రోజులలో వివేకానందస్వామి ఈ విధంగా వ్యాఖ్యానించారు: 'మాలో సంపూర్ణ కామజయాన్ని సాధించిన వారెవరైనా ఉన్నారంటే, అది యోగీన్ మాత్రమే!'

శ్రీరామకృష్ణుల మహాసమాధి తర్వాత, యోగానందస్వామి వివిధ పవిత్ర స్థలాలలో, పుణ్యక్షేత్రాలలో భగవన్నామ స్మరణచేస్తూ కాలం గడిపారు. వారణాసిలో ఒక రాత్రి ఆయన శ్రీరామకృష్ణ నామస్మరణ చేస్తుండగా, ఒక దయ్యం ఆయనకు హాని చేద్దామని ప్రయత్నించింది. వెంటనే ఆయన ''జయరామకృష్ణ'' అని బిగ్గరగా ఉచ్చరించారు. భయపడి పోయిన ఆ దయ్యం వెంటనే, 'నే నికపై ఎన్నడూ నీకు అంతరాయం కలిగించను. ఇకమీదట ఈ ప్రదేశం నీదే. నేను వెంటనే యిది వదిలి



వెళ్ళిపోతున్నాను' అన్నది. బహుశా అది దయ్యాల స్థావరం అయి వుంటుంది. కాని గురుదేవుల దివ్యనామం ఆయనను ఆ దయ్యం నుండి రక్షించింది.

పరమాత్మ భగవద్గీతలో ఈ విధంగా చెప్పారు: 'అంత్యకాలంలో నా స్మరణచేస్తూ, నన్నే చింతిస్తూ దేహం వదిలినవారు తప్పక నన్ను చేరుతారు. దీనిలో సందేహం లేదు!'

కానీ, జీవితంలోని అన్ని సమయాలలో ఆయన స్మరణ చేయ కుండా, మరణ సమయంలో మాత్రమే ఆయనను గుర్తుంచుకోవటం సాధ్యమయ్యే విషయమేనా? అది అంత సులభమా? పరమాత్మే స్వయంగా ఆ తరువాత శ్లోకాలలో ఈ విధంగా సలహాయిస్తారు: 'అర్జునా! అందుకే అన్ని సమయాలలో నన్నే తలచుకుంటూ, యుద్ధంచేయి! నీ మనస్సు, బుద్ధీ నా కర్పిస్తే, నన్నే పొందుతావు.'

మనం దైనందిన కృత్యాలు చేసేటప్పుడు, మానసికంగా దైవనామ స్మరణచేస్తూ, మనస్సు ఆయనపై ఏకాగ్రం చేయాలి. ఆ విధంగా చేసి నపుడే, జీవితపు చివరి క్షణాలలో ఆయనను గుర్తుంచుకోవటం సాధ్య మవుతుంది.

యోగానందస్వామి తన జీవితమంతా, నిరంతరం భగవన్నామ స్మరణచేస్తూ, ధ్యానిస్తూ, కాలం గడిపి, దాని సత్ఫలితాన్ని పొందారు. ఆయన ఇక కొద్దిసేపటిలో దేహం త్యజిస్తారనగా శివానందస్వామి, ఆయనను, 'యోగీన్! గురుదేవులు నీకు గుర్తున్నారా?' అని అడిగారు. యోగానందస్వామి, 'ఆహా! బాగా గుర్తున్నారు. గురుదేవులు ఇంకా-ఇంకా బాగా-మరింతబాగా గుర్తున్నారు' అన్నారు.

యోగానందస్వామి జీవితంద్వారా శ్రీరామకృష్ణులు జపయోగ సాధనద్వారా, భగవన్నామ స్మరణద్వారా సాధకుడు తన ఆధ్యాత్మిక జీవితంలో ఎదురయ్యే కామం, క్రోధం, లోభం వంటి అంతరాయాలని

సులభంగా అధిగమించి, మానవజీవిత లక్ష్యమైన దైవసాక్షాత్కారాన్ని ఈ జీవితంలోనే పొందవచ్చుని నిరూపించారు.

## 11. అధ్యాత్మ యోగం

మతం యొక్క నిజమైన సారాన్ని తెలుసుకునేవారు చాలా కొద్ది మంది ఉంటారు. ఎక్కువమందికి మతమంటే ఒక అంతుపట్టని విషయం. చాలామంది విద్యాధికులనబడేవారు గూడా లౌకిక జీవితానికి మతం ఆటంకం కలిగిస్తుందని భావించి, అతిజాగ్రత్తగా, దానినుంచి దూరంగా ఉంటారు. మరికొంతమంది, దైనందిన ఆచారాలు, సిద్ధాంతాలు, మూఢనమ్మకాలు, సంప్రదాయాలు, కర్మకలాపాలతో పూర్తిగా సంతృప్తి చెందుతుంటారు. ఇంక కొంతమంది వ్యాధినివారణ, పదవి, అధికారం, ధనసంపాదన వంటి స్వార్థపూరిత కోరికలు, మతం ద్వారా పొందటానికి ప్రయత్నిస్తారు. మరికొంతమంది మతమంటే అతీత శక్తులనో, అలౌకిక శక్తులనో, దయ్యాలు, భూతాలు, ఇంద్రజాలం, యోగశక్తులు, జాతకం,వాస్తు, ప్రేతాత్మలతో సంభాషించటం, వశీకరణ విద్య - ఇటువంటి వాటితో సంబంధం ఉన్నదని అనుకుంటారు. ఎంతటి దయనీయస్థితి! ప్రజలు మతం అసలు సారాన్ని వదలి పొల్లును పట్టుకొని, దాని గురించి పోరాడుతుంటారు.

అప్రధానమైన విషయబంధాల నుండి మతాన్ని వేరుచేసి, సనాతన ధర్మపు మహత్తర సత్యాలను అందరికీ సులభంగా అర్థమయ్యేటట్లు చేయటానికి ఈ కాలంలో పరమాత్మ శ్రీరామకృష్ణులుగా మానవరూపంలో అవతరించాడు. ఆయన వివిధమత మార్గాలలో సాధనచేసి, అన్నిమతాలు ఒకే లక్ష్యాన్ని చేరుస్తాయనే మహత్తర సత్యాన్ని తన జీవితం ద్వారా నిరూపించారు. సత్యం ఒకటే అయినా మనుష్యులు దాన్ని వివిధ నామాలతో వ్యవహరిస్తారు. మతంపేరిట కలహాలు, పోరాటాలూ అనవసరమని ఆయన ఈ ప్రపంచం ఎదుట చాటిచెప్పారు. ఆయన ఈ విధంగా



ప్రబోధించారు. 'నీ మతాన్ని నీవు మనస్పూర్తిగా అనుసరించు. అపుడు తప్పక లక్ష్యం సాధించగలవు.' మతం లక్ష్యం, సంసార బంధాలయిన జనన, మరణ, జరా, వ్యాధుల నుండి మానవుని విముక్తుడిని చేయటమే నని ఆయన స్పష్టంచేశారు. ఆనందానికి, సంతోషానికీ మూలం మతమే! అది మానవునికి అమూల్య రత్నాలయిన శాంతి, ఆనందం, అమృతత్వం, సుఖం, సంతోషం, శాశ్వత సంతృప్తులను అనుగ్రహించి, మానవుని మనస్సు నుండి అన్ని బాధలనూ, దుఃఖాలనూ తొలగిస్తుంది.

వివేకానందస్వామి మతానికి చక్కటి నిర్వచనం యిచ్చారు. ఆయన ఈ విధంగా అన్నారు: ''పశువును మానవునిగా, మానవుని మాధవునిగా అభివృద్ధి చెందించేదే మతం.''

''ప్రతి ఆత్మలో దివ్యత్వం అంతర్లీనమైవున్నది. అంతర్బాహ్య తత్వమును నిరోధించి, నిబిడీకృతమైవున్న దివ్యత్వాన్ని ప్రకటింపజేయటమే మానవ జీవిత లక్ష్యం. ఇది కర్మద్వారా గానీ, పూజ ద్వారా గానీ, మానసిక నియంత్రణ ద్వారాగానీ, తత్త్వం ద్వారాగానీ - వీటిలో ఏ ఒకటో లేక అంతకన్న ఎక్కువ వాటి ద్వారాగానీ లేక అన్నిటి ద్వారాగానీ చేసి ముక్తిని పొందగలగాలి. ఇదే మతమంటే! ఇతరమైన సిద్ధాంతాలు, సూత్రాలు, ప్రబోధాలు, ఆచారాలు, గ్రంథాలు, దేవాలయాలూ, విగ్రహాలు - ఇవన్నీ అప్రధానమైన విషయాలు, ద్వితీయశ్రేణి అంశాలు.''

ఈ నిర్వచనాల ద్వారా మతమంటే ఏమిటో మనకు సుస్పష్టమవుతుంది. ఇటువంటి అధ్యాత్మ యోగాన్ని లేక నిజమైన ఆధ్యాత్మికతను మనకు ప్రదర్శింపజేయటానికి శ్రీరామకృష్ణులు తనతోపాటు నిరంజనానందస్వామిని తీసుకువచ్చారు.

పందొమ్మిదేళ్ళ వయస్సులో నిరంజన్ ప్రేతాత్మలలో నమ్మకం కలవారి వలలో చిక్కుకున్నాడు. ఉన్నత విద్యాభ్యాసంకోసం అతను కలకత్తా వచ్చి, వాళ్ళ మేనమామగారింట్లో ఉండేవాడు. దురదృష్టవశాత్తూ, అతని మామ అయిన డాక్టర్ ప్యారేచంద్ మిత్ర ఆ బృందం నాయకుడు.

నిరంజనుని అసాధారణ లక్షణాలు చూశాక, ఆ యువకుని తమ బృందంలో చేర్చుకోవాలని ఆయన ప్రలోభపడ్డాడు. దృఢసంకల్పశక్తి, పవిత్రమైన మనస్సుకల నిరంజనుడు ప్రేతాత్మలను ఆవహింపచేసే చక్కటి మాధ్యమంగా ఉపయోగపడ్డాడు. మంచి శక్తిగల మనస్సు గలవారిని గూడ వశం చేసుకోగల మహత్తర శక్తిగల యువకుడు లభించినందుకు వాళ్ళ మామ చాలా సంతోషించాడు. ఈ మధ్యలో, తన శుద్ధసాత్త్వికమైన మనస్సు వలన, నిరంజనుడు అద్భుత మానసిక శక్తులతో, దీర్ఘకాల వ్యాధులనుగూడ నయం చేయగలిగే శక్తిని పొందాడు. ఆ విధంగా, క్రమక్రమంగా నిరంజనుడు నిజమైన ఆధ్యాత్మికతకు దూరమవసాగాడు. కానీ భగవంతుని ఇచ్ఛ వేరుగావుంది. దైవం అటువంటివారిని సంరక్షించటానికే అవతరించాడు. అందుచేతనే విధివశాత్తూ నిరంజనుడు శ్రీరామకృష్ణుల వద్దకు అనుకోనిరీతిలో తీసుకురాబడ్డాడు.

శ్రీరామకృష్ణుల అసాధారణ ఆధ్యాత్మిక శక్తి గురించి ప్యారేచంద్ విన్నాడు. ఈ పెద్దచేపను తన వలలో పట్టుకొందామని ఆయన అనుకొన్నాడు. శ్రీరామకృష్ణులను వశం చేసుకోటానికి నిరంజనుడే అద్భుతమయిన మాధ్యమమని భావించి, నిరంజనుడు, ఇంకొక యిద్దరు యువకులతో కలిసి ఆయన దక్షిణేశ్వరం బయలుదేరాడు.

ఈ ప్రపంచాన్నంతా ఆకర్షించే మహానుభావు డక్కడ తన ప్రియమైన నిరంజనుని కోసం దక్షిణేశ్వరంలో ఆత్రుతగా వేచివున్నాడన్న విషయం ఆయన కప్పుడు తెలియదు. నిరంజనుని చూడగానే, గురుదేవు లీ విధంగా వ్యాఖ్యానించారు: 'ఈ బాలుడు చాలా మంచివాడు - నిష్కపటి, నిజాయితీపరుడు.' వెంటనే ప్యారేచంద్, 'అయ్యా! ఇతను నా మేనల్లుడు. అతను ఎవరినైనా వశీకరణ విద్యద్వారా చక్కగా వశం చేసుకోగలడు. అంతేగాక ప్రేతాత్మలకు అతను చక్కటి మాధ్యమము' అన్నాడు. 'సిగ్గు! సిగ్గు, అటువంటి పిశాచకృత్యాలలో ఎన్నడూ పాల్గొనకు' అని గురుదేవులు తీవ్రంగా ప్రతిస్పందించారు.



ఇంత జరిగినా, ప్యారేచంద్ గుణపాఠం నేర్చుకోలేదు. తమ శక్తిని ఉపయోగించి శ్రీరామకృష్ణులను వశీకరణ చేస్తామన్న తమ కోరికను వ్యక్తపరిచాడు. గురుదేవులందుకు అంగీకరించి, ఒక కుర్చీలో కూర్చున్నారు. నిరంజన్, వాళ్ళ మేనమామ, మరొకరు కలిసి తమ శక్తినంతా ఉపయోగించారు కానీ ఆ ప్రయత్నంలో సఫలీకృతం కాలేకపోయారు. ఒక గంటసేపు తీవ్రప్రయత్నం చేశాక, ప్యారేచంద్ ఈ విధంగా తమ ఓటమిని అంగీకరించాడు: 'అయ్యా! మీరు మహానుభావులు. దృఢమైన, శక్తిమంతమైన మనస్సు కలవారు. మిమ్మల్ని మేము వశీకరణ చేయలేము.'

నిరంజన్ గురుదేవులపై వశీకరణ చేయలేకపోయాడు కానీ గురుదేవులు అతనిని వశం చేసుకొన్నారు. గురుదేవులు నవ్వుతూ, వేళాకోళంగా, ''చూడు! ఇంకొక దయ్యం-పవిత్రదయ్యం నిన్నిపుడు ఆవహించింది. ఎంత ప్రయత్నించినా, నీ వీ దయ్యాన్ని తొలగించుకోలేవు'' అన్నారు.

తన భావిశిష్యుడిని గుర్తించిన గురుదేవులు అతనిని దగ్గరగా పిలిచి, రహస్యంగా 'ఇక్కడికి తరచు వస్తూ ఉండు' అన్నారు.

ఈ పిలుపు నిరంజనునికి ఒక్కనికే కాదు. మతం పేరిట అటువంటి వ్యర్థకార్యకలాపాలలో నిమగ్నమయిన వారందరికీ గురుదేవు లిచ్చిన పిలుపు యిది. నిరంజనుని ఒక ఉపకరణంగా తీసుకొని, మానవాళి కందరికీ గురుదేవు లిచ్చిన హెచ్చరిక యిది. నిరంజనునితో ఆయన ఈ విధంగా అన్నారు: 'నాయనా! వారితో నీ సంబంధాలు వెంటనే త్రెంచివేసుకో! నీ మనస్సును దయ్యాలపై వుంచితే, నీవే దయ్యమైపోతావు. నీ మనస్సును దైవంపై ఏకాగ్రం చేస్తే, మనస్సంతా దైవంతో నింపబడుతుంది. ఈ రెంటిలో నీవు దేనిని ఎంచుకుంటావు?' ఈ మాటలు విన్న నిరంజనుడు - తన మేనమామ బృందంతో సంబంధాలు త్రెంచుకోవటమే కాక తీవ్రవైరాగ్యంతో అన్నిటినీ పరిత్యజించి, గురుదేవుల శిష్యుడయినాడు.

ఈ తీవ్రవైరాగ్యానికీ, ప్రపంచాన్ని వదలివేయటానికీ కారణ మేమిటి? గురుదేవుల అపార ప్రేమ! నిరంజనునిపైనే కాక ఈ మానవాళి అందరిపైన ఆయనకు గల విశ్వజనీన ప్రేమ. దానిని గురుదేవు లీ విధంగా వ్యక్తపరిచారు: 'నాయనా! నిరంజన్! రోజులు గడచిపోతున్నాయి. నువ్వె ప్పుడు దైవసాక్షాత్కారం పొందుతావు? సాక్షాత్కారం పొందకపోతే నీ జీవితమే వ్యర్థమయిపోతుంది. నీ మనస్సును ఎపుడు సంపూర్ణంగా భగవంతునికి సమర్పిస్తావు? నీ గురించి నాకెంత ఆదుర్దాగా వుందో తెలుసా?'

పరమాత్మ మనకోసం ఆత్రుతగా ఎదురుచూస్తున్నాడు కానీ పరాధీనమైన మనస్సు వలన ఆయన పిలుపును వినలేకపోతున్నాము. భగవంతునితో గల శాశ్వతసంబంధాన్ని, బంధుత్వాన్ని మరచి, మతం పేరిట, వివిధమైన చిక్కులతో కూడివున్న విషయాలలో మునిగి తేలుతున్నాము.

నిరంజనుని జీవితం ద్వారా నిజమైన ఆధ్యాత్మికతను గురుదేవులు మనకు చూపారు.

## 12. కర్మకౌశల యోగం

స్వామి వివేకానంద ఒకసారి తురీయానందస్వామితో ఈ విధంగా అన్నారు: 'సోదరా హరీ! నేను ఒక కొత్త మార్గాన్ని ఏర్పరచి, అందరికీ యిచ్చాను. ఇంతవరకూ ధ్యానంవలననో, భగవన్నామ స్మరణ వలననో, ఆధ్యాత్మిక చర్చల వలననో, యిటువంటి సాధనల వలననే ముక్తి పొంద వచ్చుననుకునేవారు. కానీ యిపుడు, యువకులైన స్త్రీ పురుషులు భగవంతుని పని చేయటం వలన ముక్తి పొందగలుగుతారు.'

ఈ ప్రపంచంలో, రెండు రకాల మనుష్యులు మాత్రమే పని చేయకుండా ఉండగలరు. మొదటి రకం - బ్రహ్మజ్ఞానులు. వారు కార్యకలాపాలకు అతీతులు, పని చేయవలసిన అవసరం లేదు. అయినా,



యితరులకు ఆదర్శంగా ఉండటం కోసం పనిచేస్తారు. రెండవ రకంవారు బద్ధకస్తులు, సోమరిపోతులు - వీరు ఉదాసీనంగా వుండి ఏ పనీ చేయరు. అటువంటివారు తమ సమయాన్నంతా తినటం, త్రాగటం, సుఖించటం, నిద్రించటంలోనే గడుపుతారు. తామసికతత్త్వం వలన వారికి అసలు పని చేయాలనే అనిపించదు. కానీ ఈ ప్రపంచంలో అందరూ పనిచేయాలి. ఇది కర్మభూమి. ఇక్కడ కర్మలు, ఆలోచనలే మానవ జీవితాన్ని, విధిని శాసించే మార్గదర్శక శక్తులు. నిజమైన పని, బంధానికి కారణమవదు. ప్రాపంచిక కర్మలు, ఆధ్యాత్మిక కర్మలు అని విడివిడిగా రెండు లేవు. పని ఒకటే కాని దాని వెనకగల దృక్పథం వేరు. పని ఏ ఉద్దేశ్యంతో చేస్తున్నా మన్నదే ముఖ్యం. అందుకనే పనిలోకి దిగేముందు, ఏవిధంగా పని చేయాలో నేర్చుకోవాలి. శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో, ''యోగః కర్మసు కౌశలం'' అని ప్రబోధిస్తాడు. ఆ నేర్పరితనం నేర్చుకొని పనులు చేస్తే, అవే మనల్ని ఆత్మసాక్షాత్కారం వైపు నడిపిస్తాయి. కౌశలంతో పనిచేసే విధానం మనకందరికీ బోధించటానికే శ్రీరామకృష్ణులు తనతోపాటు త్రిగుణాతీతా నందస్వామిని (శారదాప్రసన్న) తీసుకువచ్చారు.

కర్తృత్వభావం ఉన్నంతకాలం మనం పనికి న్యాయం చేకూర్చలేము. నేను యజమానిని, నేను అధికారిని - యిటువంటి అహంకారపూరిత భావాలు ఆధిక్యతా భావాన్ని పెంచుతాయి. ఒకసారి అటువంటి ఆధిక్యతా భావం కలిగిందంటే, సేవాభావం అదృశ్యమైపోతుంది. కర్మయోగి అంటే అందరి సేవకుడు అని అర్థం. ఏవిధమైన విచక్షణ లేకుండా భగవంతుని బిడ్డలను సేవించటానికి అతను ఎల్లపుడూ సంసిద్ధుడుగా ఉండాలి. నేను గొప్పవాడిని, నేను బ్రాహ్మణుడిని - అనే అపక్వ అహంకారాన్ని నాశనం చేయటానికి శ్రీరామకృష్ణులు పాకీవాని యింట్లో పాకీదొడ్డి శుభ్రం చేశారు. బిచ్చగాళ్ళ విస్తళ్ళు ఎత్తి, తన శిరస్సుమీద మోసి, ఆ ప్రదేశమంతా స్వహస్తాలతో శుభ్రం చేశారు. తన జీవితం, ప్రబోధాల ద్వారా శిష్యుని (త్రిగుణాతీత) మనస్సులో నిజమైన సేవాభావాన్ని చొప్పించారు.

శారదాప్రసన్న సంపన్న కుటుంబంలో జన్మించాడు. అతని యింట్లో చాలామంది పరిచారకులు, పనివాళ్ళు ఉండేవారు. అందువలన, శారదాప్రసన్న తాను చిన్నపనులు చేయగూడదని, అవి వేరేవాళ్ళు చేయ వలసినవనీ గర్వంగా అనుకునేవాడు. గురుదేవులు మంచి నేర్పరియైన గురువు. శిష్యుని ఈ గర్వాన్ని అణచి, తన పనికి యోగ్యుడైనవానిగా తయారుచేసే విధానం ఆయనకు బాగా తెలుసు. వేసవికాలంలో, ఎండ తీవ్రంగా వున్న ఒకరోజున శారదాప్రసన్న దక్షిణేశ్వరం వచ్చాడు. శ్రీరామ కృష్ణు లతనితో, ''దయచేసి కొంచెం నీళ్ళు తీసుకువచ్చి, నా పాదాలు కడుగు'' అని ఆదేశించారు. శారద స్నేహితులు చాలామంది అక్కడ దగ్గర లోనే నిలబడి ఉన్నారు. శారదకు ఆ పరిస్థితి చాలా యిబ్బందికరంగా అనిపించింది. తన జీవితంలో ఇంతవరకూ ఎన్నడూ అటువంటి పని చేయలేదు. అతని ముఖం సిగ్గుతో, అవమానంతో ఎర్రబారింది. ఏమి చేయాలో తోచలేదు. కానీ గురుదేవులు మరొకసారి అదేవిధంగా కోరారు. ఇక శారదకు ఆ పని చేయక తప్పలేదు. ఆ తరవాత రోజులలో శారద ఈ సంఘటన గురించి చెబుతూ, గురుదేవులు తన గర్వాన్ని ఆ సంఘటన ద్వారా శాశ్వతంగా తొలగించి తన మనస్సులో సేవాభావాన్ని ముద్రించారని తెలిపాడు.

గురుదేవుల ఈ శిక్షణ గురుదేవుల పనిని సరైన దృక్పథంతో చేయటంలో శారదకు దోహదపడింది. వివేకానందస్వామి కోరికమేరకు గురుదేవుల భావాల వ్యాప్తి కోసమై ఆయన బెంగాలీ భాషలో ఒక పత్రికను ప్రారంభించారు. ఆ పత్రికకు చందాదారులను చేర్పించటం కోసం, ఏ విధమైన సంకోచమూ లేకుండా, ఆయన యింటింటికీ తిరిగారు. ప్రజలు ఏమనుకుంటారో అనే భావనే ఆయనకు లేదు. శారదలోని ఈ తత్త్వం బాగా నచ్చిన వివేకానందస్వామి ఒక శిష్యునితో ఈ విధంగా వ్యాఖ్యా నించారు: 'శ్రీరామకృష్ణుల సన్యాస శిష్యులు ఊరకే ధుని (అగ్ని) వెలి గించుకొని, దాని ముందర కూర్చొని, ధ్యానం చేయటానికే జన్మించా



రనుకుంటున్నావా? వాళ్ళలో ఎవరైనా, ఏదైనా పని ప్రారంభిస్తే, వారి శక్తిని చూసి ప్రజలు ఆశ్చర్యచకితులు కావలసిందే! పనిచేసే విధానం వారి నుంచే నేర్చుకోవాలి. చూడు! త్రిగుణాతీత నా ఆదేశాలను నెరవేర్చటానికి తన ఆధ్యాత్మిక సాధనంతా వదలివేసి, ఈ పత్రిక ప్రారంభించాడు. అదేమన్నా చిన్న త్యాగమా? విజయం సాధించేదాకా అతను ఆగడు.'

సరైన దృక్పథంతో చేసే ఏ పనైనా, పూజకన్నా భిన్నమైనది కాదని త్రిగుణాతీతానందస్వామి దృఢవిశ్వాసం. ఒక సన్యాసి ఈ విధంగా యింటింటికీ తిరిగి పత్రిక చందాల కోసం బిచ్చమెత్తినట్లు అడగటం ఆనాటి సంప్రదాయ హిందువు లెవరికీ నచ్చలేదు. ఈ విషయంలో శరచ్చంద్ర చక్రవర్తి వివేకానందస్వామిని వివరణ కోరగా ఆయన ఈ విధంగా చెప్పారు: 'దీనిలో తప్పేముంది? ఈ పత్రిక గృహస్థుల శ్రేయస్సు కోసమే ఉద్దేశింపబడింది. దేశంలో ఈ నూతన భావాల వ్యాప్తి జనోద్ధర ణకు తప్పక తోడ్పడుతుంది. ఈ నిస్వార్థసేవ ఎటువంటి ఆధ్యాత్మిక సాధనకూ తీసిపోదు. ఇది ఆధ్యాత్మిక సాధనలకన్నా తక్కువని నీవు అను కుంటున్నావా? ఏమి చేసినా మానవాళి శ్రేయస్సు, హితమే మా లక్ష్యం.'

నిజమైన కర్మయోగి ఎన్నడూ పనికి బద్ధుడుకాడు. కర్మఫలితాన్ని భగవంతుని కొక్కనికే సమర్పించి, ఆయన చేతిలో పనిముట్టువలె కర్మల నాచరిస్తాడు. ఆ విధంగా ప్రతి పనినీ ఒక ఆరాధనగా, పూజగా మార్చ వచ్చు. ఇది ఏవిధంగా చేయాలో స్వామీజీ తెలియబరుస్తూ, 'భగవంతుని పనిచేస్తే, ముక్తిని పొందవచ్చు. మనల్ని మనం ఎల్లప్పుడూ యంత్రాలుగా భావిస్తూ, భగవంతుడు ఆ యంత్రాన్ని నడిపే చోదకుడు అని అనుకో వాలి. అన్ని పనులూ ఆయనవే. తన పని ఏవిధంగా చేయించుకోవాలో ఆయనకు బాగా తెలుసు. ఆయన బిడ్డలను సేవించే అవకాశం కలగజేసి నందుకు మనల్ని మనం ధన్యులుగా భావించాలి.'

అనారోగ్యకారణాల వలన అమెరికా నుంచి తిరిగివచ్చిన తురీయా నందస్వామికి వివేకానందస్వామి మహాసమాధి చెందారన్న వార్త తెలిసింది.

ఆ తరువాత మళ్ళీ తురీయానందస్వామి ఇక అమెరికా వెళ్ళలేదు. బాధ్యత నంతా త్రిగుణాతీతానందస్వామి తన భుజస్కంధాలపై వేసుకున్నారు. వారి తీవ్రప్రయత్నాలు, కృషి వలన శాన్‌ఫ్రాన్సిస్కోలో శోభాయమానమైన శ్రీరామకృష్ణ దేవాలయం నిర్మింపబడింది. పాశ్చాత్య ప్రపంచంలో ఇదే ప్రప్రథమ హైందవ దేవాలయం. గురుదేవుల సేవ ఎంతగానో చేసినా, ఆయన ఆ ఖ్యాతి తానెన్నడూ తీసుకోలేదు. ఆయన తన మనోభావాన్ని ఈ విధంగా వ్యక్తపరిచేవారు: 'ఈ దేవాలయం నిర్మించటంలో నాలో లేశమాత్రం స్వార్థంవున్నా, అది కుప్పకూలిపోతుంది. అదే గురుదేవుల పని అయివుంటే, స్థిరంగా నిలుస్తుంది. ఇది నా దృఢవిశ్వాసం.'

ఆ విధంగా శ్రీరామకృష్ణులు నిజమైన కర్మయోగి లక్షణాల్ని త్రిగుణాతీతానందస్వామి జీవితం ద్వారా ప్రదర్శింపజేశారు.

## 13. సనాతన యోగం

''యోగము'' అంటే ఆత్మ, పరమాత్మల లేక జీవ, శివుల కలయిక. ఈ కలయికను ఏవిధంగా తేవాలి? మనోవినాశనం ద్వారా. మనస్సును ఏ విధంగా నశింపజేయాలి? మహాయోగి, యోగసిద్ధాంత ప్రతిపాదకుడు అయిన పతంజలి తన యోగ సూత్రాలలో చిత్తవృత్తి నిరోధన ద్వారా మనోనాశనం చేయవచ్చని అంటాడు. అశాంతిగా, అలజడిగా వున్న మనస్సును అన్ని ఆలోచనల, భావాలనుండి దూరంచేసి స్వాధీనంలోనికి తెచ్చుకోవటం అంత సులభమైన పనికాదు. కానీ నిరంతర సాధన ద్వారా అది సాధ్యమవుతుంది.

భగవద్గీత నాల్గవ అధ్యాయంలో శ్రీకృష్ణపరమాత్మ, తాను చాలా కాలం క్రితం సనాతన యోగాన్ని వివస్వానుకు బోధించానని చెబుతాడు. కానీ, కాలక్రమేణా అది నశించింది. అందుకనే మరల ఆ యోగాన్ని శ్రీకృష్ణుడు అర్జునునికి బోధించాడు. ఆ యోగం ఎందుకని నశించింది? ఈ అంశాన్ని గురించి వ్యాఖ్యానిస్తూ, 'బలహీనులు, ఇంద్రియ



నిగ్రహంలేనివారు యోగసాధన చేయటం వలన యోగం నశించింది' అంటారు.

ఈనాటికీ, యోగాన్ని గురించి ప్రజలకు సరైన అవగాహన లేదు. దాన్ని గురించి విపరీతార్థాలున్నాయి, గందరగోళం వుంది. ఈ పదానికి (యోగము) ఎవరి ఇష్టంవచ్చినట్లు వారు అర్థం చెబుతుంటారు.

ముఖ్యంగా ఈ కలియుగంలో మానవుడు అన్నగత ప్రాణి కాబట్టి దేహబుద్ధి అతణ్ణి నిరంతరం వెన్నంటి వుంటుందని శ్రీరామకృష్ణు లనేవారు. మానవుడు ఎంతటి పతనస్థితికి చేరుకున్నాడంటే తన శరీరంలోనే నిబిడీకృతమైన ఆధ్యాత్మికత, దివ్యత్వాన్ని గురించి ఆలోచించనైనా ఆలోచించలేని స్థితిలో ఉన్నాడు. మేధాశక్తితో ఈ సత్యాన్ని గ్రహించాలన్నా, చాలాసునిశితమైన బుద్ధి, తెలివి అవసరమవుతాయి. మన కీ విషయంలో సరైన అవగాహనలేదు గనుక మనం పూర్తిగా దేహబద్ధులమై, చివరికి మన పురాతన, సనాతన, మహోత్కృష్ట యోగాన్ని గూడా నీచస్థాయికి, మన భౌతిక స్థాయికి తీసుకువస్తాము.

ఈ నవనాగరిక యుగంలో మానవుడు కొన్ని ఆసనాలు వేయటం, ప్రాణాయామం, కొన్ని క్రియలు చేయటమే ''యోగ'' అని అనుకుంటున్నాడు. యోగసాధన లక్ష్యం - శరీరాన్ని దృఢంగా చేయటం, యవ్వనాన్ని తరగనిదిగా చేసుకొని ఎక్కువకాలం సుఖాలు అనుభవించటం, అందంగా కనిపించటం, దీర్ఘవ్యాధులను నయంచేసుకోవటం, ఏకాగ్రశక్తిని, మేధాశక్తిని, జ్ఞాపకశక్తిని పొందటం, పరీక్షలలో మంచి ఫలితం పొందటం, మంచి ఉద్యోగం సంపాదించటం, చివరిగా ఈ ప్రాపంచిక సుఖాలను పూర్తిగా ఉత్సాహంతో, శక్తితో అనుభవించటం, ఆనందంగా ఉండటం అని అందరూ అనుకుంటారు. అటువంటివారిని వివేకానందస్వామి రాక్షస (విరోచన రాక్షస) జాతికి చెందినవారని అంటారు.

శరీరాన్ని ఆరోగ్యవంతంగా పోషించుకోవటంలో తప్పులేదు కాని ఈ శరీరం యొక్క ముఖ్యలక్ష్యం, ఉద్దేశం ఎన్నడూ మరువకూడదు. దేహమే

దేవుని ఆలయమని శాస్త్రాలు చెబుతున్నాయి. ధర్మాచరణ ద్వారా మనలో గల దివ్యత్వాన్ని సాక్షాత్కరింపచేసుకొనటమే ఈ శరీరం యొక్క ముఖ్యలక్ష్యం. ''యోగ'' ఈ జీవిత లక్ష్యాన్ని సాధించే ఒకమార్గం. యోగ సాధనతో తమ శరీరాన్ని, మనస్సును, ఇంద్రియాలనూ నియంత్రించుటకు తీవ్రకృషి సలిపేవారే నిజమైన యోగులు. 'తపస్వులకన్న, జ్ఞానులకన్న, కర్మిష్ఠులకన్న యోగులే మిన్నయైనవారు. కావున అర్జునా! యోగి అవటమే శ్రేయస్కరం' అని శ్రీకృష్ణపరమాత్మ సలహాయిస్తారు.

యోగాన్ని భౌతిక సంపదలకోసం, ప్రాపంచిక సుఖానుభవం కోసం ఉపయోగించేవారు, భోగులేకాని యోగులుకాదు.

ఇటువంటి పవిత్ర సనాతన యోగాన్ని ప్రదర్శించటానికే శ్రీరామకృష్ణులు తనతోపాటు అభేదానందస్వామిని (కాళీప్రసాద్) తీసుకువచ్చారు.

కాళీప్రసాద్ తన 18 ఏళ్ళ యుక్తవయస్సులో యోగ నేర్చుకుందామని చాలా ఆత్రుతగా వుండి, తనకి సరైన యోగమార్గం చూపించే గురువుకోసం తీవ్రంగా అన్వేషించసాగాడు. అతను చాలామంది ఆధునిక యోగులను కలుసుకున్నాడు, కానీ తనకి యోగాన్ని నేర్పించగల సరైన గురువును మాత్రం కనుగొనలేకపోయాడు. తన స్నేహితుని ద్వారా, శ్రీరామకృష్ణుల గురించి విన్న కాళీప్రసాద్, ఎవరికీ చెప్పకుండా ఆలస్యం చేయకుండా వెంటనే దక్షిణేశ్వరానికి హడావిడిగా వెళ్ళాడు. శ్రీరామకృష్ణులు అతని గురించి విచారించగనే, అవకాశంకోసం ఆదుర్దాగా వేచి వున్న కాళీప్రసాద్ వెంటనే తన హృదయంలోని కోరికను ఈ విధంగా వెల్లడించాడు: 'నాకు యోగ నేర్చుకోవాలని వుంది. నేర్పగలరా?' ఆ యువకుని ఉద్దేశ్యం తెలుసుకొని, గురుదేవు లెంతో ఆనందించి ఈ విధంగా అన్నారు: 'ఇంత చిన్న వయస్సులో యోగ నేర్చుకోవాలనే కోరిక కలగటం చాలామంచి చిహ్నం.. క్రితం జన్మలోనే నీవు యోగివి. కాని పరిపూర్ణత్వం సాధించటానికి యింకా కొంచెం మిగిలిపోయింది. ఇదే నీ చివరి జన్మ. అవును! నీకు తప్పక యోగసాధన నేర్పుతాను. ఈ



రాత్రికి నువ్వు విశ్రాంతి తీసుకో! మళ్ళీ రేపు ఉదయం వచ్చి నన్ను కలుసుకో'

యోగాభ్యాసాన్ని చేయాలని అంత చిన్న వయస్సులో కోరుకోవటం ఈ రోజుల్లో చాలా అరుదైన విషయం. దీనిని చూసి గురుదేవులు సంతోషించారు. ప్రాపంచిక బాధ్యతలన్నీ నెరవేర్చాక, పదవీవిరమణ చేసిన పిదపనే ఆధ్యాత్మిక జీవితంలో ప్రవేశించాలని చాలామంది అనుకుంటారు. కానీ అది సరైన దృక్పథంకాదు. సాధనను తర్వాత కాలానికి వాయిదావేసే తత్త్వం గలవారి నుద్దేశించి, తురీయానందస్వామి తరచూ వ్యాసమహర్షి చెప్పిన మహత్తర సూక్తిని ఉటంకించేవారు. ''తన ప్రాపంచిక విధులన్నీ ముగించాక భగవద్ధ్యానం చేద్దామనుకునేవాడు, అలలన్నీ అణిగాక సముద్రంలో స్నానం చేద్దామనుకునేటంతటి మూర్ఖుడు.'' శరీరము, మనస్సు, ఇంద్రియాలు శక్తిమంతంగానూ, దృఢంగానూ ఉన్నపుడే యోగాభ్యాసం చేయాలి. బలహీనమైన శరీరము, మనస్సు యోగాభ్యాసానికి పనికిరావు. అందుకనే శాస్త్రం ఈ విధంగా చెబుతుంది: 'పారమార్థిక సాధనలను సాగించటానికి ఉపకరించే ఏకైక సాధనం ఈ మానవ శరీరం. ఇది చాలా అరుదుగా లభిస్తుంది. ఈ శరీరం ఎన్నాళ్ళు ఉంటుందో చెప్పలేం కాబట్టి తెలివైనవారు బాల్యంనుండే ఆధ్యాత్మిక సాధనలను ప్రారంభించాలి.'

కాళీప్రసాద్ ఆదుర్దాను, మానసిక పరిపక్వతనూ గమనించిన గురుదేవులు చాలా సంతోషించారు. మరునాటి ఉదయం, శ్రీరామకృష్ణులు కాళీప్రసాద్‌కి మంత్రదీక్షని అనుగ్రహించారు. సాధారణ గురువులాగా ఆయన మంత్రదీక్ష యివ్వలేదు; ఆ యువకుని నాలికపై ఏవో మంత్రాక్షరాలు వ్రాసి, వాటిపై ధ్యానం చేయమన్నారు. కొద్దిక్షణాలలోనే కాళీప్రసాద్ బాహ్యస్మృతి కోల్పోయి, తన అంతరంగంలో వర్ణనాతీతమైన ఆనందాన్ని అనుభవించాడు. కాళీప్రసాద్‌కి కలిగిన ఈ స్థితిని చూసి, గురుదేవులు ఆనందించారు. ఆ తరువాత, ప్రతిరోజూ ఉదయమూ, సాయంత్రమూ

క్రమం తప్పకుండా ధ్యానించమని గురుదేవులు ఆదేశించారు. శ్రీరామకృష్ణు లొక అద్భుతమైన గురువు. ఆయన ఉపదేశం యివ్వటమే కాకుండా, తన అనుభూతులూ, అనుభవాలూ తెలిపి, శిష్యుల మనస్సులలో సద్భావాలను ముద్రించేవారు. నిరంతరం క్రమం తప్పకుండా ధ్యానం చేయటం ఆధ్యాత్మికాభివృద్ధికి అత్యంత ఆవశ్యకమని తెలుపుతూ తన నగ్నగురువు తోతాపురిని ఈ విధంగా ఉదహరించేవారు: 'ఇత్తడి గిన్నె రోజూ శుభ్రం చేయకపోతే, దానిపై మరకలు ఏర్పడే విధంగా, మనస్సును ప్రతిరోజూ ధ్యానంతో పరిశుభ్రం చేయకపోతే, దానిపై అపవిత్రపు భావాలు చేరుకుంటాయని తోతాపురి అనేవారు.'

పతంజలిగూడా తన యోగ సూత్రాలలో ఇదే విషయాన్ని ఈ విధంగా తెలిపారు: ''ఈ యోగాభ్యాసాన్ని చిరకాలం, నిరంతరం, తీవ్ర భక్తితో కొనసాగించాలి. అప్పుడే స్థిరమైన, మానసిక స్థితిని, స్థాయిని పొందగలరు.''

గురువు బోధలను కాళీప్రసాద్ తన జీవితంలో పూర్తిగా ఆచరించి చూపారు. శ్రీరామకృష్ణుల మహాసమాధి తర్వాత అతను మఠంలో చేరి అభేదానందస్వామి అయినారు.

సత్యాన్ని ధ్యానం ద్వారా గ్రహించాలని కాళీప్రసాద్ దృఢంగా నిర్ణయించుకున్నాడు. బుద్ధభగవానుని ఈ క్రింది మాటలు ఆయన్ను బాగా ప్రభావితం చేశాయి: ''ఈ ఆసనముపై నా శరీరము శుష్కించుగాక! నా చర్మము, ఎముకలు, కండలు కరిగిపోవుగాక! అనేక యుగాలపాటు కృషి చేసినా, కష్టసాధ్యమయిన నిర్వాణము, మహత్తర జ్ఞానము పొందువరకూ, నేను ఈ ఆసనము నుండి కదలను.''

బారానగరు మఠంలో ఉన్నపుడు కాళీప్రసాదు తీవ్రసాధనలో నిమగ్నమయ్యేవాడు. ధ్యానమగ్నుడై ఎక్కువ సమయం గదికే పరిమితమయ్యేవాడు. ఆ గదిని, యితర సోదర శిష్యులందరూ ''కాళీ తపస్వి గది'' అని పిలిచేవారు. ఆలంబజారు మఠంలోగూడా కాళీప్రసాద్ సాధనల కోసం విడిగా ఒక గది ఏర్పాటు చేయబడింది. స్వామీజీలు, భక్తులూ ఆ గదికి ''కాళీ వేదాంతి గది'' అని పేరు పెట్టారు.



ఆయన జీవితమంతా ధ్యానమయం. నిజమైన యోగాభ్యాసంతో అభేదానందస్వామి జీవిత లక్ష్యాన్ని సాధించి మహాయోగి అయినారు. ఆయన యోగతత్త్వము, యోగసిద్ధాంతము, మరణరహస్యము, మరణానంతర జీవితము, యోగ-అనుష్ఠానము, సిద్ధాంతము - వంటి అనేక ఆంగ్లగ్రంథాలు రచించారు. యోగాన్ని గురించి ఆయనకు గల అనుభవ జ్ఞానాన్ని ఈ గ్రంథాలు తెలియజేస్తాయి.

ఆ విధంగా గురుదేవులు మన పురాతన, సనాతన యోగాన్ని ఆధునిక మానవునికి అభేదానందస్వామి జీవితం ద్వారా ప్రదర్శింపజేశారు.

## 14. సరళ యోగం

పసిబిడ్డలు భగవంతునికి సన్నిహితంగా ఉంటారు. మన పురాణాలలోనూ, ఉపనిషత్తులలోనూ భగవంతుని పాదపద్మాలను సులభంగా అందుకోగలిగిన ధ్రువుడు, ప్రహ్లాదుడు, మార్కండేయుడు, నచికేతుడు, నామదేవుడు వంటి బాలభక్తుల ఉదాహరణ లెన్నో మనకు కనిపిస్తాయి. అందుకనే కథామృతంలో శ్రీరామకృష్ణులు పసిపిల్లలకుండే సహజత్వాన్ని, నిష్కపట్యాన్ని, భగవద్విశ్వాసాన్ని పెంపొందించుకొనమని భక్తులకు సలహాయిస్తారు. శ్రీరామకృష్ణులే సాక్షాత్తు జగన్మాత పుత్రుడు. ప్రతి విషయానికీ ఆమె పైనే ఆధారపడేవారు. తోతాపురి ఆయనకు సన్యాస దీక్ష యివ్వాలనుకున్నపుడు, ఆయన నేరుగా తల్లి భవతారిణి వద్దకువెళ్ళి ఆమె అనుమతిని కోరారు. జగన్మాతపై శ్రీరామకృష్ణులకు గల వాత్సల్యాన్ని, విశ్వాసాన్ని చూసి తోతాపురి ఆశ్చర్యచకితుడయ్యాడు. పరిపూర్ణ ఆత్మస్వరూపులైన పరమహంస లెప్పుడూ పసిబిడ్డల సాంగత్యాన్ని యిష్టపడతారు.

బాల్య లక్షణాలయిన- అమాయకత్వం, విశ్వాసం, ద్వేషరాహిత్యం, అవాంఛనీయ గుణాలయిన అసూయ, ఈర్ష్య, కామం, క్రోధం, రాగం, సిగ్గు, భయం, ఆశ యిటువంటివి లేకుండా, తన మానసిక స్థితిని బాల్య స్థితిలో ఉంచుకోగలిగిన వ్యక్తి తప్పక భగవద్దర్శనంతో అనుగ్రహింప బడతాడు. కానీ, దురదృష్టవశాత్తు, దేహం పెరిగేకొద్దీ, ఈ దివ్యగుణాలన్నీ మాయమయి, యవ్వనపు అహంకారం కలిగి అంతరాళంలో దాగి నిద్రాణంగా వున్న సంస్కారాలు, కోరికలు చెలరేగి, ప్రాపంచిక మార్గాన్ని అనుసరించేటట్లు బలవంతంచేసి, చివరికి ఈ జీవిత లక్ష్యాన్నే మరచి పోయి, కోల్పోయేటట్లు చేస్తాయి.

కానీ జీవితమంతా బాలునివంటి మానసిక స్థితినే కలిగివుండి, భగవంతుని సాక్షాత్కరించుకోవటం సాధ్యమేనా? 'అవును, సాధ్యమే' అంటూ దీనిని నిరూపించటానికి శ్రీరామకృష్ణులు తనతోపాటు సుబోధా నందస్వామిని (సుబోధ్) తీసుకువచ్చారు.

అతని జీవితంలోని కొన్నిసంఘటనలు ఈ సత్యాన్ని నిరూపిస్తాయి.

సుబోధ్ ఎప్పుడూ నిష్కపటిగా ఉండేవాడు. ఏదోవిధంగా మాయ మాటలు చెప్పి పనులు చేయించుకోవటం ఆయనకు తెలియదు. ఒకసారి, గురుదేవులు సుబోధ్‌ని అతని ఇంటి పక్కనే వుంటున్న గృహస్థ శిష్యుడయిన మహేంద్రనాథ్‌గుప్తను కలుసుకోమని చెప్పారు. ఆయన్ను కలుసుకోవటానికి తిరస్కరించి, సుబోధ్ ఈ విధంగా ప్రశ్నించాడు: 'ఆయన తన కుటుంబాన్నే త్యజించలేకపోయాడు. అటువంటివాని నుంచి భగవంతుని గురించి నేనేమి నేర్చుకోగలను?' గురుదేవులు సుబోధ్ వైరాగ్య భావాన్ని గమనించి, చాలా సంతోషించారు. కాని మహేంద్రనాథ్ గుప్త సాధారణ గృహస్థులవంటివాడు కాదనీ, ప్రత్యేక లక్ష్యసాధన కోసం ఆయన జన్మించారనీ గురుదేవులకు తెలుసు. భక్తులతో గురుదేవుల సంభాషణలను ఆయన యథాతథంగా వ్రాసుకొని ఈ లోకానికి అందించారు. అదే ఈనాడు విశ్వవిఖ్యాతి గాంచిన ''శ్రీరామకృష్ణ కథామృతము''



మహేంద్రనాథ్ వృత్తిరీత్యా ఉపాధ్యాయుడు. కానీ అంతకంటె
ఆయన శ్రీరామకృష్ణుల గురించి ప్రచారం గావించిన ప్రముఖ
ఆయన చాలామంది యువకుల మనస్సులను గురుదేవుల ఉ
ప్రభావితంచేసి, వారిని గురుదేవుల వద్దకు తీసుకు వచ్చారు.
సన్యాస, గృహస్థ శిష్యులలో చాలా మంది మాస్టరు మహ
ప్రఖ్యాతిచెందిన మహేంద్రనాథ్ గుప్త విద్యార్థులే! అటువంట
మహాశయుని కలుసుకొనటానికి తిరస్కరించిన సుబోధ్
గురించి శ్రీరామకృష్ణు లీవిధంగా పరిచయం చేశారు: 'అతను
ఏమీ మాట్లాడడు. నా నుంచి నేర్చుకొన్నదే అతను నీకు చెబుత
దగ్గరకు వెళ్ళటానికి సంకోచించవద్దు.'

పసిబాలుని మనస్తత్వంగల సుబోధ్ చివరికి మాస్టరు
కలుసుకోవటానికి వెళ్ళి, ఆయనతో జరిగిన విషయాన్న
దాచకుండా చెప్పారు. మాస్టరు మహాశయుడు అతని అమా
నిష్కాపట్యాన్ని మెచ్చుకొని, వినయంతో ఈ విధంగా అన
నిజమే! నాకేమీ తెలియదు. కానీ నేను చిదానంద, జ్ఞానసా
నివసిస్తున్నాను. ఆ సాగరం నుండి సేకరించిన నీటి కుండల
ఉంచుకున్నాను. ఎవరైనా అతిథి వస్తే, ఆ నీరే వారికి సమర్పి
చిలకరిస్తాను. అంతకన్న నేనింకేమి మాట్లాడగలను?'

ఒకసారి శ్రీరామకృష్ణులు సుబోధ్‌ని ప్రతిరోజూ క్రమం
ధ్యానం చెయ్యమని సలహాయిచ్చారు. వెంటనే సుబోధ్ 'అ
చెప్పిన విధంగా నేను చేయలేను. ధ్యానం, సాధన యివన్నీ చే
నేను మీదగ్గరి కెందుకు రావటం? ఇంకొక గురువు దగ్గరకె
అన్నాడు. గురుదేవుల దివ్యత్వంపై సుబోధ్‌కి గల దృఢవి
మాటలు స్పష్టం చేస్తాయి. దేవునియందు బాలునివలె విశ్వా
దించుకుంటే, ఆయన తన భుజస్కంధాలపై భారం వేసు
సాగరాన్ని తరింపజేసి ఆవలి ఒడ్డుకు చేరుస్తాడు. తనయం

గల దృఢనిశ్వాసాన్ని గుర్తించిన గురుదేవులు అతనిని సముదాయిస్తూ, 'సరేలే! నువ్వు ధ్యానం చేయనవసరంలేదు. కానీ రోజూ ఉదయం, సాయంత్రం మాత్రం నన్ను తలచుకో!' అన్నారు.

గురుదేవులకు కాన్సర్ వ్యాధి సోకి, భరించరాని గొంతు నొప్పితో బాధపడే సమయంలో అమాయకుడైన సుబోధ్ సులభమైన పరిష్కారాన్ని ఈ విధంగా తెలిపాడు: 'అయ్యా! దక్షిణేశ్వరంలో మీరు ఒక చెమ్మ ఊరుతున్న చీకటిగదిలో ఉన్నారు. అక్కడి చల్లదనం వలననే మీ కీ కంఠ వ్రణం వచ్చింది. దయచేసి వేడివేడి టీ త్రాగండి. మాకెప్పుడైనా గొంతు నొప్పి వస్తే, టీ త్రాగుతాము. వెంటనే గొంతునొప్పి తగ్గిపోతుంది.' గురుదేవులూ, ఆయన శిష్యుడూ - ఇద్దరూ జగన్మాత యొక్క అద్భుత శిశువులే! సుబోధ్ చేసిన సూచనను గురుదేవులు వెంటనే అంగీకరించారు. కాని పక్కనే వున్న మరొక శిష్యుడు, రాఖాల్ కల్పించుకొని, 'అయ్యా! టీ చాలా వేడిగా వుంటుంది. అది తాగితే గొంతునొప్పి యింకా ఎక్కువ కావచ్చు. దానిని మీరు భరించలేరు' అన్నాడు. వెంటనే గురుదేవులు టీ తాగాలనే సంకల్పం విరమించుకున్నారు.

సుబోధ్ కోరికలన్నిటికీ అతీతుడు. ఒకసారి వివేకానందస్వామి అతని సేవలకు చాలా సంతోషించి, ఏదైనా వరం కోరుకోమన్నారు. సుబోధ్ చాలా సంకట పరిస్థితిలో పడిపోయాడు. ఏమి అడగాలో ఆయనకే తెలియలేదు. ఏదో ఒకటి అడగమని పక్కనున్న రాఖాల్ బలవంతం చేయగా, చాలా జాగ్రత్తగా ఆలోచించి ఈ విధంగా అడిగాడు: 'నా జీవితాంతం రోజూ ఉదయంపూట ఒకకప్పు టీ దొరకాలి. ఇదే నాకు నీవు యివ్వవలసిన వరం.' అదేవిధంగా ఆయనకు ఆ వరం యివ్వబడింది. ఆయనకు జీవితాంతమూ, ఒక్కరోజూకూడా వదల కుండా ఉదయం పూట టీ లభించింది కానీ ఈ చిన్న సంఘటన సుబోధానందుని పసిపిల్లవానివంటి మనస్సును, కోరికలులేని తత్వాన్ని తెలియజేస్తుంది.



ఆ విధంగా సుబోధానందస్వామి జీవితపర్యంతమూ బాలకునివలెనే వుండి, ఆత్మసాక్షాత్కారం పొందారు.

## 15. ఆత్మసంయమ యోగం

మనకు అత్యంత సన్నిహితంగా ఉన్న పరమాత్మ దర్శనం కానివ్వకుండా ఆటంకపరచేవి బహిర్ముఖంగా ప్రసరించే మన ఇంద్రియాలే!

కథామృతంలో శ్రీరామకృష్ణు లీవిధంగా చెబుతారు: ''ఇంద్రియ నిగ్రహంగల మానవుడు మహర్షి అయిపోతాడు. తన మనోవికారాలను అణచుకొని మనస్సును స్వాధీనంలో ఉంచుకున్న వ్యక్తికి అసాధ్యమయిన దేమన్నా వుందా? దైవానుగ్రహం వలన అతను భగవంతునిగూడ సాక్షాత్కరించుకొనగలడు.'' ఇంకా ఆయన ఈ విధంగా అంటారు: ''శబ్ద, స్పర్శ, రస, రూప, గంధాదులను త్యజించినపుడే, మనస్సు పనిచేయటం ఆగినపుడే, ఎవరైనా తన అంతరంగంలో ఆసీనుడైవున్న బ్రహ్మతత్వాన్ని ప్రత్యక్షంగా, నేరుగా తెలిసికొనగలడు.''

మహామాయ ప్రభావం అత్యద్భుతంగా ఉంటుంది. సూర్యదర్శనం కానీయకుండా అడ్డుకునే మబ్బువలె ప్రపంచాన్ని సమ్మోహపరిచే భగవంతుని మాయాశక్తి జీవుల కళ్ళను కప్పివేస్తుంది. చైతన్యవంతమైన సాక్షిగా భగవంతుడు ప్రతివారి హృదయంలో దాగి వున్నా, ఎవరికీ ఆ విషయం తెలియదు. ఆయన మన ఇంద్రియాలను బహిర్ముఖంచేసి, వాటి ఆనందం కోసం రకరకాల వస్తువులను సృష్టించాడు. ఆకర్షణీయమైన, అందమైన ఈ వస్తువుల ప్రలోభంలో పడిన జీవుడు మంత్రంగాని మాయవంటి అజ్ఞానపు పొరతో కప్పబడి, అంతులేని ఆనందానికీ, అమృతత్వానికీ మూలం తనలోనే ఉందని తెలుసుకోలేక, చివరకు మృత్యువు కోరలలో చిక్కుకుంటాడు. కస్తూరిమృగం నాభిలోనే కస్తూరి ఉంటుంది కాని దానికి ఆ విషయం తెలియక, ఆ సుగంధం ఎక్కడినుంచో వస్తున్నదన్న

భ్రమలో అటుయిటూ వృథాగా పరిగెడుతుంటుంది. అదేవిధంగా, మనం గూడా అన్ని వైపులా పరిగెడుతూ, అలిసిసొలిసిపోతాం-చివరికి మనలోనే ఎల్లప్పుడూవున్న దివ్యజ్ఞానాన్ని తెలుసుకొనేవరకూ అలాగే తిరుగుతూ వుంటాం.

శ్రీకృష్ణపరమాత్మ గూడా భగవద్గీతలో ఇంద్రియ సుఖాలవలన కలిగే ఆనందం మొదట్లో తేనెవలెనూ చివరికి విషంవలెనూ పరిణమిస్తుందని అంటాడు. ఎందువలనంటే అది శక్తిని, దృఢత్వాన్ని, అందాన్ని, బుద్ధిని, జ్ఞాపకశక్తినీ - అన్నిరకాల శక్తులనూ పోగొట్టి చివరికి నాశనానికి దారి తీస్తుంది.

భగవంతుడు మనందరికీ మనస్సు అనే అద్భుతమైన పరికరాన్ని ప్రసాదించాడు. ఆధ్యాత్మిక జీవితంలో అభిరుచి కలవారు మనస్సు సహాయంతో ఇంద్రియాలను కట్టడిచేసి, క్రమశిక్షణలో ఉంచుకోవాలి. ఇంద్రియాలకు బద్ధమైవున్న మనస్సును వాటినుంచి ఇవతలికి లాగి దేవునిపై కేంద్రీకరింపజేయాలి. ఈ ఆత్మసంయమ యోగాన్ని తెలియజేయటానికి గురుదేవులు తనతో హరిప్రసన్న (విజ్ఞానానందస్వామి)ని తెచ్చారు.

సాధన ప్రారంభదశలో సాధకుడు జాగ్రత్తగా ఉండకపోతే, పతనమయ్యే ప్రమాదముందని గురుదేవులకి తెలుసు. అందుకనే కథామృతంలో గురుదేవులు చాలాసార్లు కామినీకాంచన త్యాగం గురించి పదేపదే చెబుతారు. స్త్రీ, పురుషుల మధ్యగల సహజాకర్షణ వలన ప్రమాదం ఉంది గనుక వారు విచక్షణారహితంగా ఒకరితో ఒకరు కలవకూడదని ఆయన వారించారు. సాధకులకు ఈ మార్గంలో మార్గదర్శకునిగా ఉండటం కోసం ఆయన తనతో హరిప్రసన్నను తెచ్చారు.

ఒకరోజు గురుదేవులు హరిప్రసన్నకు ఈ విధంగా ఉపదేశించారు: 'ఎప్పుడూ స్త్రీల విషయంలో జాగ్రత్తగా వుండు. నీ సౌశీల్యంమీద ఎటువంటి మచ్చ ఏర్పడకుండా చూసుకో! స్వర్ణంతో చేయబడిన బొమ్మ అయినాసరే, స్త్రీరూపం వైపు చూడకు. ఇదంతా నీ కెందుకు చెబుతున్నానో తెలుసా? నువ్వు అమ్మ భవతారిణికి చెందినవాడివి. ఆమెకోసం నువ్వు ఎంతో పని చేయవలసి ఉన్నది. చిలకకొట్టిన పండు అమ్మకి నివేదించలేము. అందుకనే నిన్ను జాగ్రత్తగా ఉండమంటున్నాను.'



విజ్ఞానానందస్వామి పవిత్రాత్మ, కామవిజేత. ఒకసారి ఆయన ఒక స్వామితో యిలా అన్నారు: 'నా 53 ఏళ్ళ జీవితంలో నేను ఎన్నడూ, చివరికి కలలో సైతం స్త్రీరూపం దర్శించలేదు. జగన్మాత తన ఆకర్షణీయ, మాయారూపం ఎన్నడూ నాకు చూపలేదు.'

గురుదేవుల సలహా హరిప్రసన్నకు ఒక్కరికే కాదు, మానసిక బలహీనత కల వారందరి కోసం ఉద్దేశించబడింది. కామకాంచనాల బానిసలకు, స్త్రీని కామపూరిత దృష్టితో తప్ప చూడలేనివారి కోసం, గురుదేవులు హరిప్రసన్నను ఒక సాకుగా, పరికరంగా తీసుకొని సాధకులకు ఆధ్యాత్మిక జీవితంలో సహాయం చేశారు. తన గురుదేవుల సలహాను హరిప్రసన్న తుచ తప్పకుండా అనుసరించి యితరులకు ఆదర్శంగా నిలిచారు.

సాధన ప్రారంభదశలో విజ్ఞానానందస్వామి స్త్రీలతో చాలా కఠినంగా వ్యవహరించేవారు. పురుషుల సమాజంలోకి ఏ స్త్రీనీ అనుమతించేవారు కాదు. ఒకరోజు పాకీదొడ్లు శుభ్రంచేసే వ్యక్తి ఏదో స్వంత పనిమీద వెళుతూ, తన చిన్నకూతురిని విజ్ఞానానందస్వామి వారి పాకీదొడ్డి శుభ్రం చేయటానికి పంపించాడు. ఆ అమ్మాయి విజ్ఞానానందస్వామిని, మెట్లు దిగివస్తుండగా చూసి చిరునవ్వుతో అభివాదం చేసింది. ఒక స్త్రీ తన పాకీదొడ్డిని శుభ్రం చేయటం యిష్టంలేని స్వామి ఆమెతో, ''రేపటినుంచి ఈ పాకీదొడ్డిని ఎవరూ శుభ్రం చేయనవసరం లేదు'' అన్నారు. ఈ విషయాన్ని ఆమె తన తండ్రికి చెప్పింది. ఆ సాయంత్రం ఆ పాకీవాడు స్వామి వద్దకు ఆదుర్దాగా వెళ్ళి క్షమాపణ కోరాడు. శివానందస్వామి ఒకసారి ఈ విధంగా వ్యాఖ్యానించారు: 'హరిప్రసన్న ఆశ్రమంలోకి ఒక ఆడ ఈగ కూడా ప్రవేశించలేదు.'

ఐతే, విజ్ఞానానందస్వామి స్త్రీలను ద్వేషించలేదు. ఆయన ఒక
ఆదర్శసన్యాసిగా తన గురువు ఆదేశాలను నిజాయితీగా పాటించారు.
శ్రీరామకృష్ణుల ఉపదేశాలు, బోధలు మనిషి, మనిషికీ మారుతుంటాయి.
ఆయన తన శిష్యులకి ఎటువంటి ఆదేశాలిచ్చినా, అవన్నీ మానవాళి
అంతటికీ వర్తిస్తాయి. అందువలననే ఆయన వివిధ మనస్తత్వాలకీ సరిపడే
విధంగా, వివిధ నమూనాలు, మూసలూ తయారుచేశారు. వివేకానంద
స్వామికి మరొక విధంగా శిక్షణనిచ్చి, ఆయన మనస్సునుండి కామభావాన్ని
పూర్తిగా తొలగించారు. స్వామీజీ దృష్టిలో ఈ ప్రపంచంలో ఉన్నది
ఒకే ఒక్క సత్యం - అదే ''ఆత్మ'' - ఆయన లింగభేదంలేని ఆత్మ, స్త్రీ
పురుషులలో సర్వత్రా వ్యాపించివున్నట్లుగా తన నేత్రాలతో దర్శించ
గలిగేవారు. ఆ భావన వలననే ఆయన జాతి, కుల, మత, వర్ణ, లింగ
భేదాలులేక అందరితోనూ సన్నిహితంగా కలిసిపోయేవారు. స్త్రీలతో
స్వామీజీ చాలా కలుపుగోలుగా ఉండటం చూసి విజ్ఞానానందస్వామి
ఆయనను దాని గురించి అడిగితే, స్వామీజీ సమాధానం చెబుతూ,
'గురుదేవులు విశ్వశ్రేయస్సు కోసం అవతరించారు. ఆయన ఒక్క పురుష
లని ఉద్ధరించటానికే వచ్చారనుకుంటున్నావా? స్త్రీ, పురుషుల నందరినీ
ఆయన రక్షిస్తారు. నీకు గురుదేవు లిచ్చిన ఆదేశాలు, ఉపదేశాలు సత్య
మైనవే! వాటిని నీవు నిజాయితీగా అనుసరించు. కానీ నాకు వారిచ్చిన
ఉపదేశాలు వేరు' అన్నారు.

వివేకచూడామణిలో శ్రీశంకరాచార్యులవారు వాక్సంయమనమే
యోగసాధనలో ప్రథమ సోపానమని అంటారు. విజ్ఞానానందస్వామికి తన
వాక్కుపై తనకు పూర్తి స్వాధీనం ఉండేది. పోచికోలు కబుర్లలో, పనికిరాని
సంభాషణలలో ఆయన వ్యర్థంగా కాలం గడపటం ఎవరూ, ఎన్నడూ
చూడలేదు. అంతేగాక ఆయన మఠంలో ఎవరినీ ఆ విధంగా చేయ
నిచ్చేవారుకాదు. మితభాషి అయిన విజ్ఞానానందస్వామి ఒంటరిగా ఉండ
టానికి ఎక్కువ ఇష్టపడేవారు.



విజ్ఞానానందస్వామి ఎవరికీ బోధలు చేయలేదు. కానీ ఆదర్శవంత
మైన క్రమశిక్షణాయుత ఆధ్యాత్మిక జీవితాన్ని గడిపారు. ప్రాపంచిక
సుఖాలపట్ల ఆయన పూర్తి నిరాసక్తత కనబరచేవారు. ఇంద్రియ ద్వారా
లన్నిటినీ బంధించి, అంతంగంలోకి చొచ్చుకొనిపోయి తన అంతరాళంలో
గల అమూల్య రత్నాలను ఆయన సాధించారు. హరిప్రసన్న గుప్తబ్రహ్మ
జ్ఞాని అని బ్రహ్మానందస్వామి అనేవారు. ఆ విధంగా ఆయన జీవితం
ద్వారా క్రమశిక్షణాయుతమైన జీవితం ఆత్మసాక్షాత్కారానికి దారితీస్తుం
దని గురుదేవులు చూపారు.

## 16. కృపాయోగం

దేవుని రాజ్యంలో పక్షపాతానికి తావులేదు. అక్కడ పేదవారు -
సంపన్నులు, పాపాత్ములు-పుణ్యాత్ములు, మంచివారు-చెడ్డవారు, బాగా
చదువుకొని సర్వమూ తెలిసినవారు-అజ్ఞానులూ, పురుషులు-స్త్రీలు,
ఉన్నతులు-పతితులు అనే వ్యత్యాసమే లేదు. ఆయన అందరికీ సమంగా
చెందినవాడు. మనమందరమూ ఆయన బిడ్డలం కాబట్టి ఎవరినీ
పక్షపాతబుద్ధితో చూడడు. భగవంతుని రాజ్యంలో ప్రతిఒక్కరూ సమాన
మైన హక్కు కలిగివున్నారు. ఇంకా చెప్పాలంటే భగవంతునికి బలహీనులైన
తన బిడ్డలంటే చాలా ఇష్టం. మంచివారు, పవిత్రులూ అయిన ఆధ్యాత్మిక
పురోభివృద్ధి చెందినవారికి బాహ్యసహాయం ఎక్కువ అవసరం లేదు.
కానీ బలహీనులైన తన బిడ్డలకి సహాయం చేయటానికి భగవంతుడు
మానవరూపంలో అవతరిస్తాడు. దుష్టులు, బలహీనులంటే ఆయనకు
ఇష్టమనటానికి గొప్ప రుజువు భువిలో ఆయన అవతరణే! ఆయన
అనుగ్రహం ఎల్లపుడూ ప్రవహిస్తూనే ఉంటుంది. అది ఎప్పుడు, ఏ
విధంగా మనపై ప్రసరిస్తుందో తెలియదు కాబట్టి, దానిని స్వీకరించ
టానికి మన హృదయాలను ఎల్లపుడూ తెరచివుంచి, సంసిద్ధంగా
ఉండాలి. అదృష్టవంతులు అడగకుండానే ఆ అనుగ్రహం పొందగలుగు

తారు. కొంతమంది మాత్రం దానికోసం కృషి, ప్రయత్నాలు చేయవలసి ఉంటుంది. ఆయన అనుగ్రహం ఒకవ్యక్తిపై వర్షించినపుడు, మూర్ఖులు తెలివిగలవారిగా రూపొందుతారు. జగదంబ అనుగ్రహంతో మూర్ఖుడైన కాళిదాసు మహాకవిగా మారినటువంటి సుప్రసిద్ధ దృష్టాంతం అందరికీ విదితమే. గీతాధ్యాన మంత్రంలో ఈ భావం అతి సుందరంగా వ్యక్తపరచ బడింది:

''మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిం ।
యత్కృపా తమహం వందే పరమానందమాధవం ॥''

స్వయంకృషి ద్వారా, సాధనలు చేయటం ద్వారా భగవంతుని సాక్షాత్కరించుకొనగలనని ఎవరైనా అనుకుంటే, అది అజ్ఞానమే అవుతుంది. కూరగాయల దుకాణంలో దొరికే కూరగాయల వంటివాడు కాదు భగవంతుడు. కొంత డబ్బిచ్చి ఆయనను కొందామంటే సాధ్యంకాదు. ఆయన అనుగ్రహం లేకుండా ఎవరూ ఆయనను సాక్షాత్కరించుకొనలేరు.

గురుదేవుల ప్రత్యక్ష శిష్యులైన హరినాథ్ (తురీయానందస్వామి) గురుదేవులను చాలాకాలం చూడటానికి రాలేదు. విచారించగా, అతను వేదాంత గ్రంథపఠనంలో మునిగిపోయాడనీ, తీవ్రసాధనలతో భగవత్సాక్షాత్కారం పొందాలనుకుంటున్నాడనీ గురుదేవులకు తెలిసింది. కొద్దిరోజుల తర్వాత శ్రీరామకృష్ణులు కలకత్తాలోని బలరాంబోసు గారింటికి వెళ్ళి, హరినాథ్ కోసం కబురుచేశారు. హరినాథ్ రాగానే అతనిని పలకరించి, గురుదేవులు తానింతకు ముందు మాట్లాడుతున్న భక్తులతో సంభాషణ కొనసాగిస్తూ, హరినాథ్‌ని చూపిస్తూ ఈ విధంగా అన్నారు: 'దైవానుగ్రహం లేకుండా - జ్ఞానంకానీ, భక్తికానీ, దైవసందర్శనంకానీ పొందలేరు. కామినీ-కాంచనాలు అసత్యాలని గ్రహించటం అంతసులభమైన విషయమా? దృశ్యప్రపంచం అశాశ్వతమైనదనీ ఉనికిలేనిదనీ దృఢ



విశ్వాసం కలగటం సులభసాధ్యమేనా? ఆయన దయలేక అది సాధ్యమేనా? స్వయంకృషితో ఎవరైనా అటువంటి దృఢవిశ్వాసం పొందగలరా? మానవుడు పరిమిత శక్తులుగల అల్పజీవి మాత్రమే కదా! తనంతట తాను సత్యంలోని లక్షవ వంతు గూడా తెలుసుకొనలేడు.' స్వంత ప్రయత్నాల ద్వారా, సాధనల ద్వారా జ్ఞానం పొందుదామని అహరహమూ కృషిచేస్తున్న హరినాథ్, గురుదేవుల ఈ మాటలు తనను ఉద్దేశించే అనబడినవని గ్రహించి, తన తప్పును తెలుసుకున్నాడు.

నిజాయితీగా, మనఃస్ఫూర్తిగా ఆయన్ను తలిస్తే భగవంతుడు మనకు సహాయం చెయ్యటానికి సర్వసన్నద్ధుడుగా ఉంటాడు. దైవానుగ్రహం వలన భక్తునికి అసాధ్యమైనదేదీ లేదు. అతను ఆధ్యాత్మిక జీవితంలో ఎటువంటి ఆటంకాలనయినా ఎదుర్కోగలడు. అయితే, అతనికి భగవంతునిపై దృఢ విశ్వాసం మాత్రం ఉండాలి. యోగానందస్వామి జీవిత చరిత్రలోని ఈ క్రింది సంఘటన గురుదేవుల అహేతుక కరుణ గురించి తెలియజేస్తుంది.

వివాహం కాకముందు యోగీన్ (యోగానందస్వామి) గురుమహరాజ్‌ను తరచూ సందర్శించేవాడు. ఆయన తల్లి ఆయనకు బలవంతంగా వివాహం చేసింది. యోగీన్ చాలా నిరాశ చెందాడు. ఆధ్యాత్మిక జీవితం యందు తనకుగల ఆశలు వదలుకున్నాడు. దక్షిణేశ్వరంలో గురుదేవులను చూడటానికి వెళ్ళటం పూర్తిగా మానుకున్నాడు. శ్రీరామకృష్ణులు యోగీన్‌కు కబురుచేసి ఏదోవిధంగా దక్షిణేశ్వరం వచ్చేటట్లు చేశారు. యోగీన్‌ని చూడగానే గురుదేవులు త్వరత్వరగా అతని దగ్గరకు వచ్చి, 'వివాహమైతే ఏమి? నేను వివాహం చేసుకోలేదా? దాన్లో అంత భయపడవలసినదేమున్నది? యిక్కడి (తనని చూపించుకుంటూ) దయ, అనుగ్రహం వుంటే లక్షలాది వివాహాలయినా నిన్ను ఏమీ చేయలేవు, అవి శక్తిహీనమయిపోతాయి. సాంసారిక జీవితం గడుపుతూ, భగవత్సాక్షాత్కారం పొందదలుచుకుంటే, నీ భార్యను ఒకసారి యిక్కడికి తీసుకురా!

నీ యిద్దరినీ అందుకు అర్హులుగా చేస్తాను. ప్రాపంచిక జీవితం వదిలి భగవంతుని చేరదలచుకుంటే, అదికూడా సాధ్యమయ్యేలా చేస్తాను.'

యోగీన్ మనస్సు ఒక్కసారిగా చాలా తేలికయింది. హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు. తన తల్లి మాటను కాదనలేక వివాహం చేసుకున్నాడు కానీ యోగీన్ హృదయం భగవంతునికై విలపిస్తూనే ఉన్నది. తాను చేసిన తప్పు గురించి పశ్చాత్తాపపడుతూనే ఉన్నాడు. అతని హృదయావేదనను అర్థం చేసుకున్న దయామయుడైన గురువు తన అనుగ్రహంచేత అతని మార్గంలోగల ఆటంకాలను తొలగించారు.

భగవంతుని అనుగ్రహం పొందాలంటే మనకేమి కావాలి? ఇది మనకు తెలియజేయటానికి గురుదేవులు తనతోపాటు ''లాటు'' (అద్భుతానందస్వామి) ని తీసుకువచ్చారు. గ్రామీణ బాలుడు, నిరక్షరాస్యుడు, మాటలు ఉచ్చరించటం గూడ సరిగ్గారాని లాటు గొప్ప మహానుభావుడు, సాధువు అయినాడు. ఈ అద్భుతం ఎలా జరిగింది? భగవంతుని దయవలన. తన అమాయక హృదయం ద్వారా లాటు ఏవిధంగా దైవానుగ్రహం పొందాడో అతని జీవితంలోని కొన్ని సంఘటనలు తెలియజేస్తాయి.

కలకత్తాలో పనికోసం వచ్చినపుడు లాటు చాలా అమాయక బాలుడు. శ్రీరామకృష్ణుల గృహస్థ శిష్యులలో ముఖ్యుడయిన రామచంద్ర దత్త యింట్లో అదృష్టవశాత్తు అతనికి పని దొరికింది. ఏమీ చదువురాకపోవటమే ఆయనను శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులలో విశిష్టవ్యక్తిగా చేసింది. నిరక్షరాస్యతే ఆయనకు ఒక అనుగ్రహంగా, ఆశీస్సుగా పరిణమించింది. అతని మనస్సు హేతువాదానికి అతీతంగా వుంది కాబట్టి, సందేహించటానికి శిక్షణ పొందలేదు కాబట్టి, అతను గురూపదేశాలన్నిటినీ ఏవిధమైన సందేహమూలేని స్వచ్ఛమైన మనస్సుతో స్వీకరించగలిగాడు. శ్రీరామకృష్ణుల ఈ క్రింది బోధనలను రామచంద్ర చెబుతున్నపుడు మొట్టమొదటిసారి వినగానే గురుమహరాజ్ ప్రేమకు లాటు



వశుడయినాడు. రామచంద్ర దత్తా గురుమహరాజ్ మాటల నీవిధంగా చెప్పారు: 'భక్తుడు ఎక్కడ వున్నాడు? ఎలా ఉన్నాడు? అతని అంతస్తు ఏమిటి? అనికాక అతని మనస్సునే భగవంతుడు చూస్తాడు. భగవంతుని గురించే ఆవేదనపడుతూ, ఆయన తప్ప వేరేమీ అక్కర్లేదనుకునే వానికి భగవంతుడు తప్పక ప్రత్యక్షమవుతాడు. భగవంతుని హృదయపూర్వకంగా పరిశుద్ధమైన హృదయంతో పిలవాలి. నిజమైన ఆవేదన లేనిదే ఎవరూ భగవంతుని పొందలేరు. ఆయన కోసం ఏకాంతంలో ప్రార్థించాలి, విలపించాలి అపుడే ఆయన తన అనుగ్రహం వర్షింపజేస్తాడు.'

అమాయక, పసిబిడ్డ తత్త్వంగల లాటు హృదయంలోనికి ఈ మాటలు సూటిగా ప్రవేశించాయి. వెంటనే అతను వాటిని ఆచరణలో పెట్టాడు. గురుదేవులతనికి సూచించిన ఒకే ఒకమార్గం ''భగవంతుని కొరకు విలపించు''. ఆ మార్గాన్ని అనుసరించి ఈ బాలుడు ఒక దుప్పటి కప్పుకొని భగవంతునికోసం తీవ్రంగా విలపించసాగాడు. దైవంపై లాటుకి చిగురించిన ప్రేమను గురుదేవులు ప్రజ్వరిల్లచేశారని తెలుసుకోలేని రామచంద్రదత్త కుటుంబ సభ్యులు, లాటు అతని తల్లిదండ్రుల గురించి విలపిస్తున్నాడని అనుకున్నారు.

శ్రీరామకృష్ణులను చూడాలని చాలా ఆత్రుతగావున్న లాటు తనని దక్షిణేశ్వరం తీసుకెళ్లమని రామచంద్ర దత్తని ప్రార్థించాడు. రామచంద్ర దత్త అందుకు అంగీకరించి, లాటును తనతోపాటు దక్షిణేశ్వరం తీసుకువెళ్ళాడు.

గురుదేవులు తన భావిశిష్యుడిని (లాటు) గుర్తించి, అతన్ని తనతో వదలి వెళ్ళమని రామచంద్ర దత్తను అర్థించారు. ఈ విధంగా గురుదేవుల మాటలపైగల అఖండ విశ్వాసం లాటు జీవితాన్నీ, గతినీ పూర్తిగా మార్చివేసింది.

లాటుకి గురుదేవుల వాక్కులు వేదవాక్కులే! వాటిని ఆయన ఎన్నడూ జవదాటలేదు. ఒకసారి దక్షిణేశ్వరంలో, ఆయనకు నిద్ర వచ్చి

సాయంత్రమే నిద్రపోయాడు. శిష్యుడు ఆ సమయంలో నిద్రించటం చూసిన రామకృష్ణులు అతనిని నిద్రనుంచి లేపటమే కాకుండా ఈ విధంగా తీవ్రంగా మందలించారు: 'నువ్వు సాయంత్రమే నిద్రిస్తే, ఇంకెపుడు ధ్యానం చేస్తావు? రాత్రి గడిచిపోయిందన్న విషయమే తెలియనంత గాఢంగా, తీవ్రంగా ధ్యానం చేయాలి. దానికి బదులుగా అతిపవిత్రమైన ఈ సంధ్యాసమయంలో గూడా నీ కనురెప్పలు నిద్రతో వాలి, సోలిపోతున్నాయి. నిద్రపోవటానికే యిక్కడికి వచ్చావా?'

లాటుకి ఈ మందలింపు చాలు. ఇక రాత్రులెన్నడూ నిద్రించగూడదని ఆయన తక్షణమే ప్రతిజ్ఞబూనాడు. రాత్రి నిద్రని జయించటానికి, వశం చేసుకోవటానికి, ఆయన ఎంతో కష్టపడ్డాడు. ఆయన ఈ విధంగా చెప్పారు: ''గురుదేవుల మాటలు విని నాకెంతో దుఃఖం కలిగింది. నాకు నేనే 'నే నెంత పనికిరాని వాడిని. అరుదైన పవిత్ర సాంగత్యం కలిగివుండి కూడా సమయాన్ని వృథా చేస్తున్నానే!' అని నా మనస్సును కొరడాతో ఝుళిపించాను. నిర్మోహమాటంగా, నిర్దయగా నిద్రవచ్చినప్పుడల్లా కళ్ళపై నీళ్ళు చిలకరించుకుంటూ వేగంగా అటుయిటూ గంగాతీరంలో నడుస్తూ, నిద్ర పోగొట్టుకునేవాడిని. ఆ విధంగా ఒక రాత్రంతా గడిచింది. మరుసటి రోజు రాత్రి గూడా నిద్రపై నా పోరాటం కొనసాగింది. అదొక భయంకరమైన పోరాటం! పగటిపూట నా కళ్ళపై నిద్రముంచుకు వచ్చేది. అయినా నా పోరాటం మానలేదు. ఆ విధంగా రాత్రింబవళ్ళూ నా యుద్ధం కొనసాగింది. చివరికి, రాత్రినిద్ర నా స్వాధీనంలోనికి వచ్చింది.''

లాటుకి గల శ్రద్ధాభక్తులను చూసి గురుదేవులు చాలా సంతోషించారు. దయతో తన అనుగ్రహాన్ని ఆయనపై వర్షింపజేసి అనేక అద్భుత ఆధ్యాత్మిక అనుభూతులను ప్రసాదించారు.

ఒకసారి భావపారవశ్యస్థితిలో గురుదేవులు లాటుతో ఈ విధంగా అన్నారు: 'ఒకానొక రోజున వేద, వేదాంత భావరత్నాలు నీ నోటి



నుండి జాలువారగలవు.' ఈ మాటలు ఆ తర్వాత కాలంలో నిజమయినాయి.

గురుమహరాజ్ మాటలపై సంపూర్ణ విశ్వాసం ఉంచి, వాటిని ఆచరణలో పెట్టారు గనకనే లాటు గురుమహరాజ్ అనుగ్రహాన్ని పొందగలిగారు.

మిడిమిడి జ్ఞానంతోనూ, అర్థరహిత అహంకారంతోనూ మిడిసిపడుతుంటాం గనకనే మనం ఆయన అనుగ్రహానికి పాత్రులం కావటం లేదు. ప్రతిఒక్క విషయానికీ మనకి హేతువు, తర్కం కావాలి. మనం చాలా గొప్పగా భావించే మేధాశక్తి మన ఆధ్యాత్మిక పురోభివృద్ధికి ఆటంకమవుతుంది. కొంత పరిమితి దాటి మన మేధస్సు పనిచేయలేదన్న విషయం మనం మరచిపోతుంటాం. ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, మేధాశక్తులకు అతీతమైన సత్యం మన స్థూల, అపవిత్ర మనస్సు ద్వారా తెలియబడదు. అందువలననే శ్రీశంకరాచార్యుల వారు వివేకచూడామణిలో గురువాక్యాలపై శాస్త్రవాక్యాలపై దృఢవిశ్వాసం, పరిపూర్ణశ్రద్ధ ఉంటేనే ఉన్నత సత్యాలని గ్రహించగలరని అంటారు.

అపుడపుడూ, విద్యాధిక్యత, జ్ఞానం, ఒక బంధంగా మారి పేరు ప్రఖ్యాతుల పట్ల, ధనార్జన పట్ల, కీర్తిప్రతిష్ఠల పట్ల కోరికలను కలగజేసి సాధకునికి నష్టం కలిగిస్తాయి. అందుకనే శ్రీరామకృష్ణులు శాస్త్రాలు మానవుని ఈ సంసారానికి బంధించే ముడుల వంటివి అని అన్నారు. మానసిక అలజడులకు, ఆందోళనలకూ అతీతమైన, స్వచ్ఛమైన మనస్సుగల నిరక్షరాస్యుడైన లాటుని శ్రీరామకృష్ణులు తనతో తీసుకువచ్చారు. అతనిలో కపటం - ఏ విషయంలోనూ రాజీపడటంలేదు, సందిగ్ధత, సందేహం లేదు - ఉన్నదల్లా విశ్వాసం, కఠోర సాధన, దృఢనిర్ణయం - వీటన్నిటికీ మించి సహజత్వం, సరళత్వం, భగవత్సాక్షాత్కారం యందు తీవ్రమైన ఆకాంక్ష, ఆవేదన. ఈ సద్గుణాల వల్లనే గురుమహరాజ్ అనుగ్రహం పొందటానికి సరియైన ఉపకరణంగా లాటుకి అర్హత లభించింది.

అతని జీవితం ద్వారా గురుమహరాజ్ - జాతి, మత, కుల, లింగ, మేధాశక్తి, సాంఘికస్థాయి, పదవులతో సంబంధం లేకుండా, భగవంతుని అనుగ్రహానికై హృదయపూర్వకంగా, ఆర్తితో, అశ్రుపూర్ణ నయనాలతో పిలిపించే వారందరికీ ఆయన అనుగ్రహం తప్పక లభిస్తుందని తెలియ జేశారు.

శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులైన ఈ పదహారుమంది మహాను భావులు శ్రీరామకృష్ణుల దివ్యనాటకంలో విభిన్న పాత్రలు పోషించటానికి రకరకాల వేషాలతో భువిపై అవతరించారు. వాళ్ళ పాత్రలను అద్భుతంగా పోషించి, ఇతరులకు ఆదర్శంగా నిలిచారు. మనకు తెలిసింది చాలా తక్కువ. వాళ్ళ అడుగు జాడలలో నడవటానికి కావలసిన శక్తి, సరైన అవగాహన ప్రసాదించమని వారినే ప్రార్థిద్దాం. అప్పుడే మనం భగవాన్ శ్రీరామకృష్ణుల, దివ్యజనని శ్రీశారదాదేవీల అనుగ్రహాన్ని పొందటానికి అర్హుల మవుతాం.



## శ్రీరామకృష్ణపై మా ప్రచురణలలో కొన్ని

శ్రీ రామకృష్ణ కథామృతము (5 Vols)
శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర
శ్రీ రామకృష్ణ సంక్షిప్త జీవిత చరిత్ర
రామకృష్ణ బోధామృతము
శ్రీ రామకృష్ణోపనిషత్తు
శ్రీ రామకృష్ణ దివ్యవాణి
గురూపదేశములు
నా గురుదేవుడు
శ్రీ రామకృష్ణ జీవిత సంగ్రహము
శ్రీ రామకృష్ణ సహస్రనామ స్తోత్రము



శ్రీరామకృష్ణ మఠము
మైలాపూరు, చెన్నై - 600 004

Atma Sakshatkaraniki
Shodasa Yogalu (Telugu) Rs.10.00
ISBN 81-7120-858-4